# ఆంధ్ర సచిత్ర వార పత్రిక.

25-3-77
75 పైసలు



AGACHARYA

ఉగాది సంచిక

అతి గాఢంగా పనిచేసే అమృతాంజన్
డెర్మల్ ఆయింట్ మెంట్ తామర, గజ్జి, దురదలు,
దద్దురులు ఇంకా ఇతర సాధారణ చర్మరోగాలను
అమోఘంగా నివారిస్తుంది,
ఈ రోజే ఒకటి కొనండి!




**అమృతాంజన్**
**డెర్మల్ ఆయింట్‌మెంట్**

**అమృతాంజన్ లిమిటెడ్**
14/15 లజ్ చర్చ్ రోడ్డు
మద్రాసు 600 004.

# మీ చర్మాన్ని రక్షించుకోండి



SAA/AM/1905 TEL

# భారతదేశంలో మొట్టమొదటి సారిగా ఓ అద్భుతమైన మాస పత్రిక వెలువడింది!

రేపు

తొలిసంచిక ఏప్రిల్ 1977 రెండు రూపాయలు



మీరు ఏమాత్రం
ఊహించలేని,
మీకింతకుముందు ఎక్కడా
పరిచయంలేని,
వినూత్న శీర్షికలతో-
మీ అంతరంగాన్ని,
మీ చుట్టూవున్న
ప్రపంచాన్ని విప్పిచూపిస్తూ.
మిమ్మల్ని ప్రతి పేజీలోనూ
మంత్రముగ్ధుల్ని
ఉత్తేజితుల్ని చేస్తూ.
నూతన ప్రపంచాన్ని
నూతన జీవితాన్ని
మీ కనులముందు
ఆవిష్కరించే
తెలుగు
మనస్తత్వ మాసపత్రిక

రేపు

ఏలూరురోడ్
విజయవాడ-520002.

-KANDAMURI..

DIMPLE

ధరావతు కట్టగల, లేదా ఆ మొత్తానికి బ్యాంకు గ్యారంటీ యివ్వగల ఏజంట్లు మాత్రమే సంప్రదించాలి.

కోరికలన్నీ గోపికలైతే కొంటె కృష్ణుడే ఈ జతగాడు
ఏ యే మాయలు చేసినా అందగాడమ్మా అల్లరి గున్న!




ప్రసాద్
ఆర్ట్ పిక్చర్స్

# ఆలుమగలు

—ఈస్ట్మన్ కలర్.

నిర్మాత
ఎ.వి. సుబ్బారావు

స్క్రీన్ ప్లే-దర్శకత్వం
తాతినేని రామారావు

సంగీతం: టి. చలపతిరావు

నవయుగ

NVKR

## మనలో మాట

పాల్గొన్న వారు ఈ సారి రెండు చిత్రాలను, ఒకే సంఖ్యలో వోట్లు వేసి ఉత్తమ చిత్రాలుగా ఎన్నుకున్నారు.

బ్యాలట్ విజేత లందరికీ సూ శుభాకాంక్షలు. బ్యాలట్ ఫలితా లిక్కడ యిస్తున్నాము.









ఉత్తమ నటులు

అక్కినేని ... జయప్రద

ఉత్తమ దర్శకుడు

విశ్వనాథ్ ...

ఉత్తమ సంగీత దర్శకుడు

మహదేవన్

ఉత్తమ సహాయ నటులు

చంద్రమోహన్ — రోజారమణి

ఉత్తమ హాస్య నటులు

రాజబాబు ... రమాప్రభ





రామచంద్రుడు గొడ్డలిని క్రింద పెట్టి గంటులో వేలు పెట్టి చూశాడు తరువాత అతడు నేలమీద జీరాడుతున్న దాన్ని పట్టుకుని దూరంగా వెళ్ళిలాగాడు. పెద్దగ చప్పుడు చేస్తూ నేలగూలింది.

కొబ్బరిచెట్టు పడిపోవడం గమనించి కంచె బయట పశువుల మేపుతున్న కుర్రవాళ్ళిద్దరు పరుగున వచ్చి చెంగు చెంగున కంచెను దాటి లోని కొచ్చారు. కంచెలో దూరుకుపోయిన కొబ్బరికాయలను చెరొక దానిని వాళ్ళు బయటకు తీసి చంకన ఇరికించుకున్నారు అది చూసి కుట్టిగాడు బీడీని అవతలపారేసి వచ్చి తోడేలు వలె పశుల కాపరుల మీద పడ్డాడు.

"ఎయ్యిరా. కాయి కిందెయ్యిరా." అంటూ ఒక పిల్లవాని రెక్క పట్టుకుని వీపుమీద చెళ్ళుమనిపించాడు వాని చంకలోని కొబ్బరికాయ కిందపడింది ఇంతలో రెండవ కుర్రవాడు కాయను అలాపారవేసి కంచెను గెంతి పరుగు పుచ్చుకున్నాడు. కుట్టిగాడు ఆరెండు కాయలను తీసి తట్టలో వేసి, అక్కడే నిలుచుని ఉన్న కుర్రవాడిని చురచుర చూస్తూ "ఏమి సొంతం!ఏమిసొంతం! చెట్టుకిందపడంగానే పరుగునొస్తా ఉండరు ఏవో ఈళ్ళబ్బ గంటు ఈడ పూడ్చి పెట్టినట్టు" అన్నాడు. అతడు నడుంవంచినలువైపులాచెల్లాచెదురుగా పడిఉన్న కొబ్బరికాయలను ఏరి తట్టలో వేయసాగాడు. కుర్రవాడు వీపు నిమురుకుంటూ అల్లాగే నిలుచున్నాడు.కొబ్బరికాయలనుఏరడం పూర్తి చేసిన కుట్టిగాడు నడుము ఎత్తి కుర్రవాడిని చూసి, "ఇంగా ఈపురుద్దుకుంటూ అడ నిలుచు కోనుండావుగదరా, బయటకు పోతావా. నేనాడికొచ్చి అర్రుమెడ ఇంచాల్నా.' అన్నాడు

కుర్రవాడు అలాగే వీపు రుద్దుకుంటూ కంచెవైపు నడచాడు. కంచెవద్ద ఆగి వెనుదిరిగి కుట్టిగాని వైపు ఆశగా చూడసాగాడు.

కుట్టిగాడు కొబ్బరి కాయల తట్టను ప్రక్కన పెట్టుకుని కూర్చుని మరొక బీడీని వెలిగించి పొగలాగి వదలి "మునసబుగారి సొత్తంటే అయిపుట్నోనికంతా సొంతమే. యాడబడిన్నాయాలా పరుగెత్తుకుని రావడమే కొల్లబోతా ఉన్నట్టు" అన్నాడు. అతడు వెనకకు తిరిగి కంచెవద్ద నిలుచుని ఉన్న కుర్రవాడిని చూసి "పోతావా ఈడనుంచి కొంకి విరగేతునా" అనరచాడు.

కుర్రవాడు కంచె దాటుకుని అవతల




(గత సంచిక తరువాయి)

నిక్కినిక్కి చూస్తున్న తన మిత్రుని కలుసుకున్నాడు.

గురివెంద పొదలో దూరుకుపోయి ఉన్న ఒక కొబ్బరికాయను రామచంద్రుడు గొడ్డలితో బయటకు లాగి చేతులలోకి తీసుకున్నాడు.

రామచంద్రుని చేతిలోని కాయను చూసిన తొత్తు "మళ్ళ నువ్వేంది అదొక కాయను అదిమి పెట్టుకోనుండావు...ఇట్ట తీసుకొచ్చి తట్టలో ఎయ్" అన్నాడు.

రామచంద్రుడు వినయంగా "ఈ కాయ నాగ్గావాల సామి. ఇన్నడిగే తీసుకుందారను కుంటా ఉండా" అన్నాడు.

"ఇంచేపు ఆ తల మాసినోల్లను చీ కొట్టడమైంది. ఇంగ నిన్నొకసారి తనీగాచి కొట్టాల్నా ?"

"ఇదొక్క కాయే సామి. నాకేవీ శానా వొద్దు"

"ఒక టెంకాయ తిరపతి కొండమీద ఎంత అమ్ముతాడందో తెల్సునా, నాలుగు రూపాయలు. నువ్వేమో ఇదొక్కటే అని అనామతుగా అనేస్తా ఉండావు." అన్నాడు తొత్తు.

"కొండమీద అమ్మే కాయకూ. తోటలో కాయకూ పోలిస్తే యట్టసామి నేను పనోణ్ణిగదా."

"నువ్వు పనోడు యాడఐతివి నువ్వే చెప్తా ఉంటివే దినకూలికి రాలేదని; దొరతనం చేసేదానికి వొచ్చినానని ఇకోర్టులో వాకీలు మాదిరి పట్టాలు మాట్లాడితివి గదరా." అన్నాడు తొత్తు.

"లేదు సామి ఆడూరికే ఉండకుండా కంట్లో పుల్ల పెట్టినట్టు మాట్లాడితే అట్టన్నా సామి అంతే." అన్నాడు రామచంద్రుడు.

కుట్టిగాడు కల్పించుకుని, "అంతే అంటే ఇంగా ఏమేమి అందామనుండావురా" అన్నాడు.

తొత్తు కుట్టిగానిని వారిస్తూ, "నువ్వు గమ్మునుండ్రా." అని రామచంద్రుని వైపు తిరిగి. "పని చూడమని చెప్పినందుకే నా మాలోణ్ణి అట్ట దబాయిస్తివిగదరా తూరుపోడా. నువ్వు మా మాలోణ్ణి దబాయిస్తే, ఒకటే నన్ను దబాయిస్తే ఒకటా?"అన్నాడు.

కుట్టిగాడు ఉత్సాహం పొంగిపోతుండగా, "అట్టడుగుసామి అట్టడుగు." అంటూ తొత్తును మెచ్చుకుని, రామచంద్రునివైపు తిరిగి, "ఒరే తూరుపోడా. మీ రంపాలోల్లు మాటలు నేర్చినోల్లురా. నెత్తిమీద చెప్పుతో కొట్టి దెబ్బ నీకు తగల్లేదు సామీ మీ మంగలోనికి తగిలింది అనేటోల్లురా మీరు." అన్నాడు.

తొత్తు అతనివైపు చూసి, "నువ్వూరుకో" అని రామచంద్రునితో, "తూరుపోడా ఎందుకీ రాయబారాలన్నీ. నీ పట్టాలు, లా పాయింట్లూ నీ దగ్గరే పెట్టుకుని ఆ కాయ తెచ్చి తట్టలో ఏసిపోయి పనూడు"అన్నాడు.

రామచంద్రుడు దీనంగా, "ఇంత తోట ఉండగా ఈ బుడతకే ఇట్ట పట్టుబట్టాల్నా సామీ ఉడత కొరికేస్తే పోలా ?" అన్నాడు

తొత్తు, "ఆ బార్తెంతా నిన్నిపుడెవుడు పొడమన్నాడు. నీకు చెట్టుకు మూడు రూపా

**జరిగినకథ :9** రామచంద్రుడు చేసిన చాకిరీకి ఫలితంగా ఇల్లు కట్టుకోవటానికి పోరంబోకు నేల ఇప్పిస్తాడు పెదరెడ్డి. రామచంద్రుడి భార్య నాగ. పెదరెడ్డి కోరినట్లు కోర్టుకెళ్ళి దొంగ సాక్ష్యం చెప్పడు రామచంద్రుడు. పెదరెడ్డి రిపోర్టు చేయటంతో పోరంబోకు ఖాళీచేయమని రామచంద్రుడికి ఉత్తర్వు జారీ చేస్తాడు కలెక్టరు. పెదరెడ్డిని వేడుకోటానికి వచ్చిన రామచంద్రుడిని తోటి హరిజనులే హింసిస్తారు. రామచంద్రుడి ఇల్లు పడగొట్టిస్తారు పట్టాధికారులు. ఊరు వదిలిపెట్టి బయల్దేరతాడు రామచంద్రుడు కుటుంబంతో. తను మజిలీచేసిన పూరి మునసబు పెదరెడ్డిలాటి వాడేనని వింటాడు రామచంద్రుడు. మునసబుగారి తోటలో కొబ్బరిచెట్లు కొట్టడానికి వెళ్తాడు రామచంద్రుడు.

యల లెక్కన కూలి ఇప్పుడమే జాస్తి. ఇంక ఈ నాములుగూడ యిదనుంచి ఇత్తుం. మరియాదగా ఆ కాయపెట్టి తట్టలో ఎయ్ నీకు మళ్ళి మళ్ళి చెప్పేదిలేదు.'' అన్నాడు.

రామచంద్రుడు కొబ్బరికాయను రొమ్ముకానించుకుని, "ఈ కాయ ఒక వైద్యానికి కావాల నాకు." అంటూ కిష్టునివైపు చేయి చూపించి, "మా పిలగానికి నిన్నట్నుంచి నొప్పికాక పట్టుకుంది. రాతిరంతా నిద్ర లేదు-'' అంటూ ఏదో చెప్పబోయాడు.

అతని మాటలను తొట్టు మధ్యలోనే అపురూ గట్టిగా, "ఆ మాటే ఇంచేపు చెప్తే ఇనపడలేదంట్రా. నెప్పులో చెట్లు మొలిచినాయా నీకు? ఊట్టెదిరిగే యదవలకు కాలొచ్చిందే తప్పు. ఇంగ మీకు వైద్యాలు గూడా చెయించాలంటే అయ్యేపనేనా?'' అని కుర్రోగని వైపు తిరిగి "ఒరే మువ్వ పోయి ఆ కాయనిట్ట పెరక్కురా'' అన్నాడు.

అతగాలా అనడమే తడవుగా కుర్రోగాడు లేచి ఆరిచేతులను రాచుకుంటూ, మల్ల యుద్ధానికి బయలుదేరిన వానవలె రామచంద్రుని వైపు నడవసాగాడు.

అలా వస్తున్న వాని కన్నులలోకి గుచ్చి చూస్తూ రామచంద్రుడు లేచి నిలుచున్నాడు. అతని పిడికిళ్ళు బిగుసుకున్నాయి. ఇంతలో బండమీద కూర్చుని ఉండిన హరిజనులు లేచి ఎండుటాకుల మీద సళసళమని శబ్దం చేస్తూ నడచి వచ్చి రామచంద్రుని చుట్టూ నిలుచున్నారు. రామచంద్రుడు తలను త్రిప్పి ఆ మూకను చూశాడు. పిడికిళ్ళు సడలినవి. అతడు కాండ్రించి నేలమీద ఉమిసి, కొబ్బరి కాయను బలంగా విసిరాడు. అది గాలిలో ఎగిరి దబ్బుమని తట్టలో పడింది. రామచంద్రుడు నాటి నుండి బయలుదేరిన ఒక ధిక్కారాగ్ని వదిలి కుడిచేతితో తల వెంట్రుకలను ఒకసారి ఎగదువ్వుకుని వెనక్కు తిరిగాడు.

కిష్టుడు తన ముందు జరుగుతున్న వాగ్యుద్ధాన్ని వింటూ కనుబొమలు ముడివేస్తూ నోరు తెరిచేస్తూ నిలుచుని ఉన్నాడు. రామచంద్రుడు వానితో "నువ్వు సత్తరానికి సారా అదే తగ్గిపోతుంది. మానివే ళకు తగ్గకుంటే మళ్లోసన్నా చూద్దాంలే. పో.'' అన్నాడు.

అతడు పిల్లవానిని కంచె దాటించి, తిరిగి వచ్చి దారాన్ని చుట్టగ చుట్టి భుజానికి తగిలించుకుని కొబ్బరి చెట్టును ఎగబ్రాకడం ప్రారంభించాడు.

## *17*

రామచంద్రుడు కొబ్బరి చెట్టుమీద సగానికి ఎగబ్రాకి నిలుచున్నాడు. భుజానికి తగిలించుకుని ఉన్న దారపు చుట్టను విప్పాడు.

చెట్టుమీదనున్న రామచంద్రునికి అల్లంత దూరాన మండుటెండలో నడుస్తున్న కిష్టుడు కనిపించాడు. నడుస్తున్న పిల్లగాడు ఆగి, నిక్కరును ఎగనెట్టుకుంటూ కాలువ గట్టున కూర్చున్నాడు. కొంతసేపటికి వాడు కాలువగట్టునుండి లేచి నిక్కరును కిందకు వదిలి తల వంచుకుని నడవసాగాడు.

దూరంగా గ్రామం వైపునుండి ఒక మానవాకారం కొబ్బరి తోటవైపుగా పరుగులు తీస్తూ వస్తుండడం రామచంద్రునికి కని



# ఇన్‌క్రెడిబుల్ గాడెస్

పించింది. తుంటరి పిల్లవానిచేత తరుమబడుతున్న కోడిపెట్టవలె ఆ మానవాకారం పొలం గట్లమీద పడుతూ లేస్తూ వస్తున్నది. రామచంద్రుడు కండ్లు చిట్లించుకుని చూశాడు. ఆ వచ్చేది తత్వాలుపాడే ముసలి వాడని రామచంద్రుడు క్రమక్రమంగా పోల్చుకున్నాడు.

ముసలివాడు రొప్పుతూ రోజుతూ కొబ్బరి తోటలోకి ప్రవేశించాడు. గేటు వద్దనే తారస పడిన హరిజనుడిని ఏదో అడిగాడు. అతని ప్రశ్నకు సమాధానమిస్తూ ఆ హరిజనుడు కొబ్బరి చెట్టుమీదనున్న రామచంద్రుడ్ని చేయి ఎత్తి చూపించాడు. ముసలివాడు తనబడుగు దేహాన్ని ఈడ్చుకుంటూ కొబ్బరిచెట్టుకిందకు వచ్చాడు.

చెట్టుమీదనున్న రామచంద్రుడు కిందకు చూసి, "ఏంది సామీ. ఎండలో పరుగెత్తుకుంటూ వొచ్చినావు. నాతో ఏమన్నా పనా?" అనడిగాడు.

ముసలివాడు తలపైకెత్తి అరచేయిని సూర్యకిరణాల కడ్డంగాపెట్టుకుని, "నువ్వేనా తూరుపాయనా చెట్టుమీదుండేది దిగిరా. చిన్నా దిగిరా. నీ పందులన్నీ కాసలో కుంటదగ్గర చచ్చి పడుండాయి" అన్నాడు.

రామచంద్రుని చేతిలోని దారం జారి కిందపడింది అది ఎండిన ఆకుల మీదపడి శబ్దంచేసింది. అతడు, "ఎట్టెట్టా!!" అంటూ తొడలను, మోకాళ్ళను వంచి కొబ్బరి చెట్టు వెంబడి సర్రున కిందకు జారాడు. కను మూసి తెరచేలోగా అతడు నేలకు చేరాడు. అతని తొడలు బబ్బలు చెక్కుకుని పోయాయి గాయాలలో నెత్తురు కమ్మ సాగింది.

అతడు కంచెవైపు నడచి కంచెను, కాలువను ఒక్కసారిగా లంఘించి పొలాలవెంబడి పరుగెత్తసాగాడు.

ఎండ ప్రచండంగా కాస్తున్నది. ప్రపంచాన్ని భస్మీపటలం చేయడానికి సంకల్పించుకున్నట్లు సూర్యుడు చెలరేగుతున్నాడు.

పొలాలను దున్నుతున్న రైతులు నాగళ్ళను ఆపి శరవేగంతో పరుగిడుతున్న రామచంద్రుని వైపు నివ్వెరపోయి చూడసాగారు. గుంపులు గుంపులుగా చేరి అడుసు మడుల లోని పురుగులను పొడుచుకు తింటున్న కొంగలు రెక్కలు టపటప కొట్టుకుంటూ, లేచి కకావికలై ఎగుర సాగాయి. ఒక ఉల్లంకి గువ్వ అవిరామంగా అరుస్తూ అతనిని వెంబడిస్తున్నది.

ముసలివాడు పడుతూ లేస్తూ పొలాల మీదుగ వస్తున్నాడు. ఊతకర్ర సహాయంతో, తడబడే అడుగులతో నడుస్తూ, చిన్నచిన్న గనిమలను చేతుల సహాయంతో ఎక్కుతూ, పెద్ద గనిమలను ఎక్కవలసి నప్పుడు దాపున ఉన్న రైతులను సహాయానికి పిలుస్తూ వస్తున్నాడు.

రామచంద్రుడు వరి పైర్లను, చెరకు తోటలను, గడ్డివాములను, గుంతలను, కాలువలను శరవేగంతో దాటుకుని మట్టి రోడ్డు మీద పడ్డాడు. మట్టిరోడ్డు మీద ట్రాక్టరు చక్రాలు దొర్లిన గుర్తులు కనిపిస్తున్నాయి. అతడు మట్టి రోడ్డుమీద పరుగిడుతుండగా పుల్లటి దుమ్ము మేఘాల వలె రేగ సాగింది. మంద గమనంతో సాగుతున్న గొర్రెలు అతని ఆ గమనంతో బిత్తరపోయి పెద్దపులిని చూసినట్లు బెదిరి రోడ్డును విడచి వేరుసెనగ చేల వెంబడి పరుగిడసాగాయి.

## వసంతోదయం

- డాక్టర్ దాశరథి

చీకటిలో చంద్రరేఖ
శిశిరంలో వసంతుని రాక
విరహికి నెచ్చెలిలేఖ
పరిణామపు తొలికేక

అట్టడుగున ఉన్నవారి
నాదుకొనుట కోసం
భరత జాతి సమైక్యతను
పరిరక్షించుట కోసం

ప్రజాస్వామ్య పథం మీద
పయనించుట కోసం
ఆ సేతు హిమాచలము
ఐక్యమైంది మన దేశం

తర తమ భేదాలు లేవు;
భరత జాతి ఒకటి -
ప్రజాస్వామ్య వ్యవస్థలో
ప్రజలంతా ఒకటి:

జగాన్ని మురిపించుటకై
ఉగాది వచ్చిన వేళ
పెళ్ళి పందిరై వున్నది;
చల్లని మన తెలుగునేల

మునసబుగారి ట్రాక్టరు అగ్రహారం నుండి తిరిగివస్తూ ఉంది. డ్రైవింగు సీటులో మునసబు కూర్చుని ఉన్నాడు. గోచెలు ధరించి ఉన్న హరిజనులు పదిమంది 'బాడీ'లో నిలుచుని ఉన్నారు. రోడ్డుమీద పరుగెత్తి వస్తున్న రామచంద్రుని చూసి, వాళ్లలో ఒకడు ఒక చేతిని పైకెత్తి ఆడిస్తూ, మరొక చేతిని నోటిలో పెట్టుకుని ఈల వేశాడు. వాని ననుసరించి మిగిలిన వాళ్ళందరూగూడ అలాగే చేశారు. కోడి పందాలలో తమకోడి గెలవగా, పారిపోతున్న కోడిని చూసి హేళన చేస్తున్నవారివలె వాళ్ళు వికృతంగా అరుస్తూ చిందులెయ్యసాగారు.

రామచంద్రుడు 'కాన'లో ప్రవేశించాడు. అక్కడ ఈత పొదలు, నాగదాడి పొదలు విస్తారంగా ఉన్నాయి. నిలువెత్తు పుట్టలున్నాయి. 'కాన' చుట్టూ మునసబుగారి చెరకు తోటలున్నాయి. 'కాన' మధ్య ఒక కుంట ఉన్నది.

రామచంద్రుడు పొదలమీదుగా కుంట వైపు దూపుకుపోయాడు. నాగదాడి కాయలను కొరుకుతుండిన ఉడుతలు క్షణకాలం తమ వెనక కాళ్లపైన నిలుచుని బిత్తరపోయి చూసి దూకులేస్తూ పరుగెత్తి దాపున ఉన్న ఈతచెట్లను ఎగబాకాయి. ముంగిసలు అడ్డదిడ్డంగా పరుగెత్తి బొరియలలోను, చెట్ల తొర్రలలోను దాగుకున్నాయి.

కుంట బురదనీటితో నిండి ఉన్నది. నీటిలో వందలకొలది తామరలున్నవి. కొన్నింటి కాడలు విరిగి పూలు నీట మునిగి ఉన్నాయి. నీటి అంచున రెల్లుగడ్డి విస్తారంగా ఉన్నది. రెల్లుగడ్డి తెల్లగపూసిఉన్నది ఆపూలు మధ్యాహ్నపు ఎండలో మెరుస్తున్నాయి.

రెల్లు పొదలలో పందుల కుప్పలు కుప్పలుగా పడి ఉన్నవి.

రామచంద్రుని పరుగు రెల్లు పొదలవద్ద ఆగింది. అతని వెన్నంటి వస్తున్న ఉల్లంకి పిట్ట చివ్వున కిందకు వాలి ఈత చెట్టుమీద కూర్చున్నది. అతడు తూలి పడిపోయేంతగా అలసిపోయి ఉన్నాడు.

ఎద ఎగిరెగిరి పడుతున్నది. ఉచ్ఛ్వాస నిశ్వాసలు ఎద్దు బుసవలె వినిపిస్తున్నవి. దేహమంతా చెమట ప్రవహిస్తున్నది. జబ్బల మీదను, తొడలమీదను ఉన్న గాయాల నుండి నెత్తురు బొట్లుబొట్లుగకారుతున్నది.

కొన్ని పందులు నీటిలో పూర్తిగా మునిగి ఉన్నాయి. కొన్నింటి దేహాలు సగం నీటిలోనూ సగం గట్టుననూ ఉన్నవి, కొన్ని పందులు గట్టున ఉన్న పాచిమీద పడి ఉన్నవి.

రామచంద్రుడు వంగి మోకాళ్ళ మీద అరచేతులు వేసుకుని తన పాదాల చెంత ఉన్న పందిని చూశాడు. గత రాత్రి తాను రెండు వందల రూపాయలకు అమ్మ నిరాకరించిన సుక్కగున్న అది. దాని నల్లని చర్మాన్ని, తెల్లని మచ్చలను చూస్తూ అతడు అలాగే నిలుచున్నాడు. దాని వెన్నెముక విరిగిఉన్నది. రామచంద్రుడు చేతిని చాచి దాని వీపును మెడనుండి తోక దాక తడిమాడు. వెన్నెముక చర్మాన్ని పొడుచుకుని వచ్చి వున్నది గాయం నుండి బయలుదేరి రక్తం డొక్కల మీదుగ పొట్టమీదకు జారి ఎండిపోయి ఉన్నది దాని కనుగుడ్ల మీద నెత్తురు పార ఎర్రగ కమ్ముకుని వున్నది. ఆ నెత్తురును చీమలు బారులు బారులుగా వచ్చి తింటున్నవి రామచంద్రుడు తలఎత్తిచూశాడు. రెండవ సుక్కగున్న కనిపించింది. అదిపూర్తిగా నీటిలో మునిగిపోయి ఉన్నది. దాని వీపుమీద నున్న తెల్లని మచ్చలు నీటి మట్టం కింద నుండి అస్పష్టంగా కనపిస్తున్నాయి. ఉలస చాపలు దాని ముట్టె చుట్టూ గుంపులు గుంపులుగా తిరుగుతున్నవి. దాని శరీరం నిండా గాయాలున్నవి గాయపు అంచులు నీటి తాకిడికి తెల్లగ మారి ఉన్నవి. ఒక పెద్ద చేప తోకతిప్పుకుంటూ వచ్చి గాయాలను పొడుస్తున్నది.

రామచంద్రుడు నడుము పైకెత్తి నిలుచున్నాడు. నేడో రేపో ఈనడానికి సిద్ధంగా ఉండిన సుక్క పందులు మూడు నిండిన పాచిమీద పడిఉన్నవి. వాని కడుపులు ఉబ్బరించుకుని ఉన్నవి. కన్నులు పీకుకొని వున్నవి మిగిలిన పందులు రెల్లు పొదలలో పడివున్నవి.

ఎండ మిటిమేలంగా కాస్తున్నది ఇప్పుడిప్పుడే గాలి వీచడం ప్రారంభించింది చెట్ల కొమ్మలు విసవిస శబ్దంచేస్తూ కదులుతున్నాయి. రెల్లు పూత గాలిలో ఎగురుతూ ఈతపొదల మీదనూ నాగదాలి పొద మీదనూ వాలుతున్నది.

రామచంద్రుడు పందులను ఒక్కొక్క దాన్నే ఈడ్చుకునివచ్చి కుంట వొడ్డున చేర్చాడు.

'కాన' చుట్టూ ఉన్న చెరకుతోటల మధ్య నుండి కొందరు మగవాళ్ళు, కొన్ని కుక్కలు ఉండి ఉండి అరుస్తున్నారు. ఒక మనిషి పట్టుదల, కర్కశత్వమూ ఉట్టిపడే కంఠంతో "య్యెంర్రా ఆ కుక్కను ఎయ్యండి. బాగ తిని గుర్రం మాదిరి బలుస్తోంది. పానాలో ఇడ్సిపెట్టకూడదు. ఎయ్! ఆ గుండెత్తు ఎయ్!" అని అరుస్తున్నాడు. ఒక కుక్క ముచ్చిలి గుంటలో గునపంతో పొడిచినట్లు కుయ్యోమంటూ దీనంగా అరవడం ప్రారంభించింది. ఇంతలో దానికి స్పృహ తప్పేట్లుగా డొక్కలో ఒక దెబ్బ తగిలిందిగాబోలు దాని ఏడుపు అకస్మాత్తుగ మధ్యలోనే ఆగిపోయింది. మనుషులు చెరకు తోటలో గబగబ పరుగిడుతున్న చప్పుడు వినిపిస్తూంది. (ఇంకా వుంది)

ఉలులులు లులులూ— ఉగాది పచ్చడీ—
ఓ ఆను నాథా ఉంగిట్లో వేస్తాను
మూతి బిగించావంటే ముకురలా వేస్తాను



## అశక్తుని ఈశ్వరారాధన

శక్తి ఉన్నవాడు భగవంతుణ్ణి ఆరాధించ డానికి కావలసిన వస్తుసామగ్రిని అంతటినీ సమకూర్చుకుని వైభవంగా పూజలు చేస్తారు. దేవాలయాలకు వెళ్ళి గుడిచుట్టూ ప్రదక్షిణాలు చేస్తారు. భగవంతుణ్ణి ఎన్నో స్తోత్రాలు పఠించి, కీర్తనలు పాడి స్తుతిస్తారు. వివిధాలైన భగవత్కైంకర్యాలకు సేవకులను నియమిస్తారు.

అశక్తులకు ఇవేవీ సాధ్యంకావు.

ఒక అశక్తుడు తన అశక్తతను వెల్లడిస్తూ తన్ను కరుణించాలని ఇలా ప్రార్థేయపడతాడు.

"ఆత్మా త్వం గిరిజా మతిః పరిజనాః
ప్రాణాః శరీరం గృహం
పూజా తే విషయోపభోగరచనా
నిద్రా సమాధి స్థితిః
సంచారః పదయోః ప్రదక్షిణ విధిః
స్తోత్రాణి సర్వా గిరః
యద్యత్కర్మ కరోమి తత్తదఖిలం
శంభో తవారాధనమ్."

## ధర్మపథం

—బులుసు వేంకటరమణయ్య.

దీని అభిప్రాయం ఇది –

పరాత్పరుడవైన ఓ మహాదేవా! నీకు సేవ చెయ్యడానికిగాని, నిన్ను ఆరాధించడానికిగాని నాకు ఏమాత్రమూ శక్తి లేదు. నన్ను కరుణించి నేను ఏ పని చేసినా అది అంతా నిన్ను ఆరాధించినట్టే భావించుకోవాలి. నా ఆత్మయే నీవు; నా బుద్ధియే పార్వతీదేవి. నా పంచ ప్రాణాలూ నీ పరివారజనం! నా శరీరమే నీ నివాసమైన దేవాలయం! మూఢుడనైన నాకు విషయోపభోగములందలి ఆసక్తియే నీకు చేసే పూజగా భావించుకో. నేను నిద్రపోవడమే నిన్ను ధ్యానిస్తూ గాఢమైన సమాధిస్థితిలో ఉన్నట్లు తలంచుకో. నేను కాలు కదుపుతూ ఇటూ, అటూ సంచరిస్తూ ఉంటే అదే ప్రదక్షిణం చేస్తున్నట్లు అనుకోవాలి. నేను పలుకుతూ ఉన్న మాటలన్నీ నిన్ను స్తోత్రం చేస్తూ ఉన్నట్లే భావించుకోవలెను. నావంటి అజ్ఞుడు ఇంతకంటె చేయగలిగినదేమున్నది?

నిజమే! భగవంతుణ్ణి స్మరిస్తే ఉత్కృష్టములైన కర్మలు ఏవి చేయకపోయినా, ఆయన అనుగ్రహిస్తాడు. భగవద్గీతలో భగవానుడు "ఏ పని చేసినా, దేనిని భుజించినా, ఏది హవనం చేసినా, ఏది దానంచేసినా, ఏ తపస్సు చేసినా – ఏ పనిని చేసినాసరే! 'శ్రీకృష్ణార్పణమస్తు' అని ఒక్క మాట చెప్పి భగవదర్పణ చేస్తే చాలు. దానివల్ల అనిర్వచనీయమైన ఫలం లభిస్తుంది" అని చెప్పియే ఉన్నాడు.

ఇది అందరూ ఎరిగినదే!

శక్తి లేనంతమాత్రాన భయపడనక్కరేదు. భగవదనుగ్రహం పొందవచ్చును దానికి తగిన ప్రయత్నం చెయ్యవలసిఉంటుంది ●

# నవరక్తిని, నవశక్తిని కలిగించే

నెస్‌కాఫే కమ్మని రుచితో
నూతనోత్సాహాన్ని
పొందండి.

# నెస్‌కాఫే.




నూటికి నూరుపాళ్లు స్వచ్ఛ
మైన కాఫీతో తయారయ్యే
ఒకే ఒక ఇన్‌స్టెంట్ కాఫీ



ప్రపంచంలోకల్లా
అత్యధికంగా
అమ్ముడుపోయే
ఇన్‌స్టెంట్ కాఫీ



# వార్ని(త్రీక్) దాండు దాండే

## తులసి బాలకృష్ణ

"హాయ్ వొచ్చేసింది గురూ హా ... వుత్తరంవొచ్చేసిందోచ్..ఆ..యిదుగో సత్యం...ఉత్తరం తెచ్చిచ్చినందుకు బోలెడు థేంక్సు-మరేమో నువ్వు కేంటిన్‌కి పోయి, నువ్వు ఓకాఫీ కొట్టేసి, ఓ రెండు కాఫీలు మాకూడా పంపించెయ్యి. ఆఁ?" కుర్చీ లోంచి లేచి, హుషారుగా గెంతుతూ,ఉత్తరం అందించి వెళ్ళన్న ప్యూను సత్యం వైపు గొంతెత్తి అరిచి, రివ్వున కుడివైపున్న చిదంబరంకేసి తిరిగి, అతగాడు బుగ్గ మీద చిటికేసి, ఒక్కగెంతులో అతని టేబిల్ మీదకి యెగిరికూచుని, మొహంఅంతా కళ్ళుచేసుకుని వుత్తరం చదవ నారంభించాడు రాజా.

చిదంబరం గుండెల్లో ఎక్స్‌ప్రెస్ రైళ్ళు పరిగెడుతున్నాయి. వందమైళ్ళ స్పీడుతో 'జెయింట్‌వీల్' మీద కూచుని తిరుగుతున్నట్లువుంది.

—గులాబిరంగు కాగితాలు. దానిమీద ఆకుపచ్చసిరాతోరాసిన ముత్యాల్లాంటి అక్షరాలు. రాజామొహంలో వెయ్యికేండిల్సు బల్బులు ముక్కుకి యిరుపక్కలా మెరిసిపోతున్నాయి.

చిదంబరం మొహంఅంతా చెమట పట్టేసింది. రాజావుత్తరం చదవడం ముగించి తనవైపు తిరిగేలోగానే గబుక్కున జేబులోంచి రుమాలులాగి మొహం తుడిచేసుకున్నాడు చిదంబరం. ఎవరైనా చూస్తున్నారేమోనని చుట్టూరా చూశాడు. ఆమూల రూములో తమిద్దరే తప్ప మూడో నరసంచారంఎప్పుడూ వుండదని తనకు తెలుసుండీకూడా తను కంగారుపడ్డందుకు సిగ్గుపడ్డాడు చిదంబరం. అంత ఆనందంలోవున్న రాజాని తను వెంటనే ఎలాగోలావెక్కిరించెయ్యాలి - లేకపోతే 'జెలసీతో చచ్చిపోతున్నాడు' అనుకుంటాడు. కానీ యెలా? గొంతు పెగల్చేదే!

ఉత్తరం చదవడం ముగించి, గర్వంగా బోరవిరుస్తూ చిదంబరంవైపుతిరిగాడురాజా.

ముఖంమీద చిరునవ్వు తెర వార్చాడు చిదంబరం.

"ఏవిటిగురూ-ఎక్కణ్ణుంచి?" అన్నాడు తెలీనట్టు!

'చదువుకో' అన్నట్లుగా చెయ్యిచాపి అందించాడు లెటర్నిరాజా. లెటర్ ముట్టుకుంటూంటే తాచుపాము పడగ ముట్టుకుంటున్నట్టుంది చిదంబరానికి.

'నువ్వు చదివావుగా! చెప్పెయ్యిగూరూ విశేషాలేమిటో మళ్ళీనేను చదవటంఎందుకూ" అన్నాడు నవ్వటానికి ప్రయత్నిస్తూ.

"అహహా! అలాకాదు. నువ్వు చదువు చెప్తాను. విశేషాలంటూ ప్రత్యేకం ఏంవుంటాయి మామధ్య. ప్రతిదీ విషయం ఓ తమాషాయే. అనుకుంటే ప్రతిదీ విశేషమే చదువు చెప్తాను. అన్నాడు రాజా - కేంటీన్ బోయ్ తెచ్చిన కాఫీని అందుకుని చిదంబరానికి ఆఫర్ చేస్తూ.

"ఖిలేవాడివోయ్ నువ్వు" అని, కాఫీ అందుకుని, బల్లమీద పెట్టి, ఉత్తరం చదవడం మొదలుపెట్టాడు చిదంబరం.

డియర్ ప్రీతమ్ రాజా!

గుడ్మార్నింగ్.

మీ లెటర్ నిన్ననే అందింది. చదువుతున్నంతసేపూ ఈ ప్రపంచాన్నే మరచిపోయేను. మీ యెదురుగావుండి నన్ను కవ్విస్తున్నట్లుగానేవుంది. నిజంగా అన్నిట్లోనూ మీరు చాలాచాలా గొప్పవారు. మాటల్లోనూ, కవిత్వాల్లోనూ, కథల్రాయడంలోనూ, ఉత్తరాలు అవతలివాళ్ళకు చదవడానికి యింట్రెస్టుగా వుండేలా రాయడంలోనూ, యిలాచెప్పాలంటే చాలాచాలా వాటిల్లో-ఆఖరుగా ... సారీ...మాట తప్పడంలో కూడా నిజం.

లేకపోతే ఏంటి డియర్!

నిన్న సాయంత్రం మీకోసం నటరాజ్

"నే నొక కెల్వినేటర్ కొన్నాను, దేశంలో దొరుకుతున్న అత్యుత్తమ మైన రిఫ్రిజరేటర్ అని-మంచి ప్రఖ్యాతి పొందినందువల్ల! ఈ కెల్వినేటర్ గొప్ప విశిష్టత కలదనడం నిర్వివాదమైన నిజం అని, నాస్వానుభవంతో. నేను నిక్కచ్చిగా చెప్పగలను దీని ఆనందమైన ఎక్కువ ఆకర్షణ, అమోఘమైన మిక్కిలి ప్రయోగం, నిశ్శబ్దమైన చక్కని వినియోగం, కనీసమైన తక్కువ ఖర్చుతో ఉపయోగం, ఇలాంటి ఎన్నో ఎన్నో మంచి కారణాలున్నాయ్, నేనీ కెల్వినేటర్‌ను ఎన్నుకొని, ఎంతో మురిసి పోవడానికి!"

— అంటున్నారు, శ్రీమతి అనితారామ్,
ఇలాంటి సుఖ, సౌకర్య ప్రదాయిని
అయిన కెల్వినేటర్‌ను సంపాదించుకున్న
ఎంతో మందిలో ఒకరుగా!



SC. 662 TEL(5)

# కెల్వినేటర్ నుంచి

## స్పెన్సర్స్

—1865 నుంచి
సేవాధర్మమే మా
జీవిత ధ్యేయం.




**స్పెన్సర్ అండ్ కో, లిమిటెడ్.**

153, మౌంట్ రోడ్ మద్రాస్-600 002 19A, అలీపూర్ రోడ్, ఢిల్లీ-110 054
స్పెన్సర్స్ బిల్డింగ్, ఫోర్జెట్ స్ట్రీట్, బొంబాయి-400 036 70, డైమండ్ హార్బర్
రోడ్, కిడ్డిర్‌పూర్, కలకత్తా-700 023

సరికొత్త 286 లిటర్ మోడల్-ఆటోమేటిక్ డిఫ్రాస్టింగ్,
ప్రయునింగు పద్ధతిగలది గూడా ప్రస్తుతం లభ్యంగా ఉన్నది.

కెల్వినేటర్ రిఫ్రిజరేటర్స్ 286, 165 లీటర్ల
నమూనాలు ఇప్పుడు సర్టిఫికేట్స్ ISI పొందివున్నవి.

థర్మామీటర్ దగ్గర ఎదురుచూసి చూసి నీరసంగా విసిగిపోయేనో, కిలకిల్లాడుతూ కలకల్లాడుతూ సినిమాకొచ్చిన జంటల్ని చూసి యెంతఅసూయ పడ్డానో, ప్రేమని ఎంతగా శపించానో మీకేం తెలుసు. నిన్నరాత్రంతా ఏడ్చి ఏడ్చి నాకళ్ళు వుబ్బిపోయేయి. నేను మిమ్మల్ని ఎంతగా ప్రేమిస్తున్నానో తెలుసుగా. మీ యింటికి రాకూడదని, మీ ఆఫీసుకి రాకూడని ఆంక్ష పెట్టారు. ఎప్పుడూ రహస్యంగా కలుసుకోవడంలోనూ, ఉత్తరాల్లో పలకరించుకోవడంతోనే సరిపోతోంది. ఇన్నాళ్ళకి కనికరించి సినిమాకి రావడానికి ఒప్పుకున్నారని నేను ఎంతగానో సంతోషిస్తే—యిలా చేశారేవిటి? నామీద ఏకారణంగానైనా కోపం వచ్చిందా? వస్తే చెప్పండి లెంపలు వేసుకుంటాను. క్షమాపణ చెప్పుకుంటాను. కాని నన్ను మాత్రం దూరంచెయ్యొద్దు రాజా, ప్లీజ్. వెంటనే లెటర్ వ్రాయండి. అప్పట్టు. నామీదకోపం లేదంటూ మీనుంచి లెటర్ వచ్చేవరకూ పచ్చిమంచినీళ్ళు ముట్టదలుచుకోలేదు. తర్వాత మీదయ.

—జన్మ జన్మలకూ...మీ.. భువన.

చిదంబరం లెటర్ చదువుతూన్నంతసేపూ అతని ముఖాన్ని రాజు గమనిస్తూన్న మాట పచ్చినిజం. రెండేసి వాక్యాల కొకసారి అతని ముఖంలో రంగులు మారుతున్నాయి. అవి తెలియకుండా వుండేందుకు మధ్యమధ్యలో కాఫీ 'సిప్' చెయ్యడానికి ప్రయత్నిస్తున్నాడు చిదంబరం. కానీ కాలకూట విషం కంఠనాళాల్ని కాలుస్తూ లోపలికి జారుతూన్నట్లుంది. అంతా చదివేసాక 'కంగాట్సు గురూ' అన్నాడు. ధ్వని అయితే బయటకు రాలేదుగాని, పెదవుల కదలికని బట్టి అర్ధం చేసుకుని 'థేంక్యూ సోమచ్ అని, పిచ్చిపిల్ల గురూ' అనికూడా అన్నాడురాజు.

* * *

డాబా మీద పుచ్చ పువ్వులాంటి వెన్నెల్లో మంచు అంత తెల్లని పక్కమీద మరుమల్లెల పందిరి వారగా పడుకున్నా నిద్రపట్టి చావట్లేదు చిదంబరానికి.

గుండెల్లో ఏదో మంట. మెదడంతా సలసలా మరిగే నూనెలో వేగుతున్న వడలాగా వుంది. ఓమూల చల్లని గాలి వీస్తూంటే కూడా - ఎన్నిసార్లు తుడుస్తున్నా ఒళ్ళంతా అయిదునిమిషాలకొకసారి వానలో తడిసినట్లు చెమట్లు.

నెమ్మదిగా పక్కకు వత్తిగిల్లి చూశాడు

# హర్ట్!(లేక) దొందుదొందే

చిదంబరం. ప్రక్కపక్కల మీద తమ్ముళ్ళూ అమ్మ అవతలగా మంచంమీద నాన్న అంతా కూడా ఒళ్ళు మరిచి హాయిగా నిదపోతున్నారు మరి తన కొక్కడికే ఎందుకు యిలా నరక బాధ కలుగుతోంది?— బహుశా దీన్నేనేమో జెలసీ అంటారు అనుకున్నాడు.

—చటుక్కున లేచి కూర్చున్నాడు చిదంబరం. చుట్టూ ఒకసారిచూసి,నెమ్మదిగా లేచి, చెప్పులు కాళ్ళకు తగిలించుకుని, చప్పుడు కాకుండా మెట్లుదిగి రోడ్డుమీదకొచ్చి నెమ్మదిగా నడక సాగించాడు జంక్షన్ వైపు.

సెకండు షోనుంచి యిళ్ళకు బయల్దేరే సినీ ప్రేక్షకుల కోసం గవర్రాజు కిళీ కొట్టు

## అతివల ఆధిక్యత

గుజరాత్‌లో లోక్‌సభ ఎన్నికలలో మొదటి రోజు పోలింగ్‌లో పురుషుల కంటే స్త్రీలు ఎక్కువగా ఓటువేయవలసిఉంది.

మార్చి 16న పోలింగు జరిగిన 13 నియోజకవర్గాలలో పురుషుల కంటే స్త్రీ ఓటరులు 16 వేలమంది అధికం. 69.2 లక్షల మంది ఓటరులలోను 34.7 లక్షలుమంది స్త్రీలు.

మార్చి 19వ తేదీన రాష్ట్రంలో రెండవ విడత పోలింగులో పురుషులు ఎక్కువమంది ఉన్నారు. 13 నియోజకవర్గాలకు 71.5 లక్షల మంది ఓటు వేయవలసి ఉండగా వారిలో 36.5 లక్షల మంది పురుషులు.

తెరిచేవుంటుంది అర్ధరాత్రి కూడా. నాలుగు సిగరెట్లు, అగ్గిపెట్టె తీసుకుని, జంక్షన్‌లోని తూముల మీదకొచ్చి కూర్చున్నాడు చిదంబరం. తనలోని యీనాటి యీ జెలసీకి కారణం ఎలా, ఎందువల్ల, ఎప్పట్నుంచి మొదలయ్యిందో ఒకసారి సింహావలోకనం చేసుకోవడానికి మోకాలుకి కాళ్ళు తగిలించి గతంలోకి పరిగెత్తించాడు.

* * *

ఒకరోజు-

రాజుకీ తనకీ ప్రేమ టాపిక్ మీద చిన్న వాగ్వివాదం జరిగింది.

ఆడవాళ్ళు ఎప్పుడూ యీ విషయంలో కేవలం నటిస్తారని, మనస్ఫూర్తిగా ప్రేమించరని, మగవాణ్ణి ఎప్పటికీ తమవెనక తిప్పుకోవడనికే ప్రయత్నిస్తారని, వాళ్ళని నమ్ముకుని మనసారా ప్రేమించి వారివెనకతిరిగిన మగాణ్ణి లోకువకట్టి చివరికి వాడికి మొండి చెయ్యి చూపించి బాధపెడతారని అన్నాడురాజు. కానీ తను ఆడవారే అసలు ప్రేమకు ప్రతీకలనీ, వారు ప్రేమించడమంటూ మొదలెడితే అందులో యిసుమంతైనా కల్మషం వుండదని వాదించాడు. ఆరోజుసాయంత్రమే తనకొచ్చిన లెటర్ని తను నవ్వుకుంటూ మురిసిపోతూ చదువుకుంటూంటే కారణమేవిటని అడిగాడు రాజు. తను ఉత్తరం అదించాడు. అది చదివి రాజు "హార్టీ కంగాట్స్ యిన్నాళ్లూ ఎందుకు చెప్పలేదూ యూ షేమ్‌లెస్ ఫెలో" అన్నాడు. అప్పుడు తను "యీమధ్యే మొదలయ్యిందీ విషయం. నువ్వు ఆశ్చర్యపోతున్నావు కదూ" అన్నాడు. లోపల 'అసూయ పడుతున్నావు కదూ?' అని అడగాలనుంది. అప్పుడు రాజు "లేదు ఆనందిస్తున్నాను" అన్నాడు. "నేను లెటర్ రాయడానికి భయపడ్తున్నాను కానియీ అమ్మాయి చూశావా రాజు తపేమని రాసి పారేసింది. ఆడవాళ్ళంతే గురూ ప్రేమించాలేగానీ, ప్రేమిస్తే ఎంతకయినా తెగించేస్తారు." అన్నాడు తను. "నీవాదనే నిజమయ్యింది చిదంబరం. విష్ యు బెస్టాఫ్ లక్" అన్నాడు రాజు తన భుజంతట్టి.

తనకి రెండ్రోజులకో లెటర్ వస్తూండేది. తను చదవటం కంటేకూడా రాజు చదవడం ముఖ్యంగా భావించేవాడు తను. రాజుకి తన మీద అసూయ కలగాలని తన తాపత్రయం. అంతలో వూరుకుంటే బాగుండును. ప్రేమ అనేది బహుకొద్ది మందికి మాత్రమే ఆ భగవంతుడు ప్రసాదించేవరమని, ప్రేమించి గెలిస్తేనే బతుక్కి సార్ధకత అని, అసలు ప్రేమ అంటే జీవితంలో ఎరగని వాడు మనిషేకాదని అనేసాడు తను. ఆవిధంగా రాజు ముందు తన ఆధిక్యతని, మగతనాన్ని చాటుకోవాలని ప్రయత్నించాడుతను. తనకొస్తున్న ఉత్తరాలగురించి కాకపోయినా, తనమాటలకి రాజు బాగా హర్ట్ అయ్యేవాడు. అది తనకెందో విధమైన అవ్యక్తానందంగా వుండేది.

కానీ ..పదిరోజుల క్రితం—

తన చేతికొక కవర్ అందించాడు రాజు. లోపల గులాబీరంగు కాగితాల మీద ఆకుపచ్చ రంగు అక్షరాలున్నాయి. ఉత్తరంచదివిన తనకి గుండెల్లో అసూయ, బాధ వెయ్యినోళ్ళతో ఘూర్ణిల్లాయి. తదేకంగా రాజుని పరీక్షించాడు తను.

—రాజు తనకంటే ఒడ్డూ, పొడుగూ వుంటాడు. తనకంటే తెల్లగా వుంటాడు,




ఉగాది
శుభాకాంక్షలతో
త్వరలో!

ఆంధ్ర: శ్రీ ఫిలింస్
నైజాం: యస్.యస్.కె.పి
సీడెడ్: జయలక్ష్మి పిక్చర్స్

VEEKAY

నున్నగావుంటాడు, పైపెచ్చు అందంగా ఉంటాడు. తనలా బట్టతలకాదు అతనిది-నల్లగా గుబురుగా తలనిండా వుంగరాలు తిరిగిన జుట్టు. తళతళ లాడేకళ్ళు. పైగా ఆ రోజు యింకా అందంగా కనిపిస్తున్నాడురాజా.

ఆరోజునుంచే తనకి వుత్తరాలు రావడం ఆగిపోయేయి. ఆ తర్వాత రాజుకి మరోనాలుగు వుత్తరాలు వచ్చాయి. ఆ అమ్మాయి యీ పూళ్ళోనే బ్యాంకులో పనిచేస్తోందిట. వీడంటే పడిచచ్చేలా వుందనేది నిస్సందేహంగా తెలిసిపోతోంది. తన మాటలకి రెచ్చిపోయి, ప్రేమ వేటలోపడి సాధించాడన్నమాట అతగాడు. తన ప్లాను యిలా బెడిసికొట్టి, తననే దెబ్బతీసింది.

-దగ్గరున్న నాలుగు సిగరెట్లు అయిపోయేయి. తూములమీంచిదిగి, పొడిగా రెండు ముక్కలనుకున్నాడు చిదంబరం — "జెలసీ మహా చెడ్డది. అలాగే వేరేవాళ్ళని తక్కువగా అంచనావేసి, సుపీరియారిటీ ఫీలవడంకూడా మహాతప్పు. తప్పొప్పేసుకోవడమే అసలుసిసలు ఒప్పు" అని.

* * *

మర్నాడు 'లంచ్ టైం'లో కేంటీన్‌లోని ఓమూల బల్లదగ్గరకు లాక్కెళ్ళాడు రాజాని చిదంబరం.

"గురూ! నువ్వు నన్ను అర్థం చేసుకుంటానంటే ఓ విషయం చెబ్తాను...ఆగు. నే చెప్పేది పూర్తిగా విను...మనిషయిన ప్రతివాడు తప్పుచేస్తాడు. తప్పు తెలుసుకుని పశ్చాత్తాపపడడమే సరైన ప్రాయశ్చిత్తం. కంగారుపడకు.. స్థిమితంగా కూర్చో చెబ్తా. ఇప్పుడు నేను చెప్పేది దయచేసి మనిద్దరి మధ్యనే వుండనియ్యి...ఇంక అసలు విషయం. మనరూంలో మనిద్దరమే కదా పనిచేస్తున్నదీ ...?

'అవునూ' అన్నట్లుగా తలూపుతూ. అయోమయంగా చిదంబరం మొహంలోకి చూసాడు రాజా.

"ఊఁ మనిషయిన ప్రతివాడికీ కొన్ని దౌర్బల్యాలుంటాయి. అలాగే నాక్కూడా కొన్ని వున్నాయి. మనిద్దర్లో నేను నీ కంటే అధికుణ్ణనిపించుకోవాలనేది నా తాపత్రయం, నీకు లేని గొప్ప లక్షణాలు నాలో వున్నాయని నీ యెదురుగా నిరూపించుకోవాలనేది, నువ్వు సాధించలేనిది నేను సాధించానని నీకు అనిపించాలనేది నా ప్రయత్నం. తత్ఫలితమే నా కొచ్చిన ప్రేమలేఖలు. అయితే నా కొచ్చిన ఆ ప్రేమలేఖల్ని చూసి నువ్వు అసూయ చెందకపోవడం నాకు నిరాశనే కలిగించింది. అందుకనే మాటలతో వీలయినంతగా నిన్ను బాధించాను. ఆ సందర్భంలో నువ్వు హర్ట్ అయినట్లు నీ మొహంలోని భావాలవల్ల తెలుసుకున్నాను. నిజంగా యెంత ఆనంద పడ్డానో మాటల్లో చెప్పలేను. నా అంత గొప్పవాడవి నువ్వు కావని నువ్వు అనుకుంటున్నావని గట్టిగా నమ్మి, మానసికంగా చాలా బలిసి పోయేను.

కాని నీకు నీ ప్రేయసి భువన గార్నుంచి లెటర్స్ రావటం మొదలెట్టడంతో నా ఆశయం తారుమారైంది. నా మాటలు నీ మనసుని హర్ట్ చేస్తూండచ్చు గానీ—నీకు ప్రేమలో విజయాన్ని సాధించి పెట్టాయి. నాకు కనువిప్పు అయింది. ఒక నిజం చెబ్తాను. బహుశా అది నువ్వు నమ్మడం కష్టమే...ఏమిటంటే అది—వంచల పేరుతో నాకొచ్చే ప్రేమ లేఖల్లోని నా ప్రేయసి... మరెవరోకాదు...నేనే! నాకు నేనే వుత్తరాలు రాసుకుంటున్నాను యిన్నాళ్ళూ"

ఉలిక్కి పడ్డాడు రాజా.

గుడ్లప్పగించి అలాగే చూస్తూండి పోయేడు.

"ఆశ్చర్య పోతున్నావు కదూ?! నాకు తెలుసు. నీకిది నమ్మశక్యంగా వుండదు. కానీ నిజం. నీకు లెటర్స్ రావటం మొదలయినప్పట్నుంచీ నా కొచ్చే లెటర్స్ ఆగిపోడానికదే కారణం. అప్పుడు అస్సలు భరించే శక్తి వుండదు నాలో. అందుకనే యిప్పుడే నా తప్పుల్నీ నీ గొప్పనీ ఒప్పేసుకుంటే — యికముందైనా మనశ్శాంతి అని యీ నిజాన్ని చెప్పేశాను. ఇప్పుడు నా కెంతో ఆనందంగా వుంది. నీ మనసుని బాధ పెట్టినందుకు క్షమించు" అన్నాడు చిదంబరం రాజా చేతులు తన చేతుల్లోకి తీసుకుంటూ.

అయితే గమ్మత్తేమిటంటే—వులిక్కి పడి, గుడ్లప్పగించి చూస్తూన్న రాజాకి చిదంబరం అన్న యీ ఆఖరి మాటల్లో ఒక్క మాటా వినిపించలేదు. రియల్లీ.

ఎందుకంటే... ఆసమయంలో—

"హార్ట్!!! నే నాచరించిన పద్ధతినే నా కంటే ముందు చేసిన నువ్వూ ఆచరించావన్న మాట!!" అని ఆశ్చర్య పోతున్నాడు అతను. ఓ క్షణం పోయేక "పోన్లే, యిప్పటికయినా చెప్పావు-యింక పోస్టల్ ఖర్చు తప్పింది నాకు" అనికూడా అనుకున్నాడు. ●

సీరియల్

# మగదిక్కు

పైడిపాటి సుబ్బరామశాస్త్రి

## 29

సరోజిని, సురేఖా పని చేసే స్కూలులో, వివిధ కులాలవారూ వివిధ మతాలవారూ పంతులమ్మ లున్నారు. అందులో కన్యలు, వార్ధక్యం పొందిన కన్యలు, సధవలు, విధవలు — అనేక రీతుల వారున్నారు. పంతులమ్మల విశ్రాంతి గదిలో సంభాషణలు అనేక రీతులుగా వుంటాయి. అందులో ఇది ఒకటి.

"సరోజినీదేవీ! నీ పెళ్లికి మాకు డిన్నరు ఎప్పుడిస్తావు ?"

"కాస్త ముందుగా చెప్పు తల్లీ! మేము ప్రెజెంటేషను కొనుక్కోవాలి."

"సుఖాన వున్న ప్రాణాన్ని అప్పుడే కష్టాన పెట్టుకోకు. ఎవరిచేతో తాడు మెడలో కట్టించుకొని. శాస్త్రం చెప్పినట్టుగా వుంది (ఇది ఊత పదం) పెళ్లి కిప్పుడేం తొందర ? హాయిగా కొన్నాళ్లపాటు అల్లా వుండమ్మా. మగవాడనేవాడు, తాళి మెడలో యెప్పుడు కట్టాడో, ఆడదానిమీద అప్పటినుంచే అతని అధికారం ప్రారంభం అవుతుంది. మనం యెంతటి వాళ్లమయినా, ఆ పురుష సింహాలముందు పిల్లులు కావలసిందే !"

"అసలు, యీ మెళ్లో తాడుకట్టే వ్యవహారం యెవడు కనిపెట్టాడోకాని, బలే పసందుగా కనిపెట్టాడు. బహుశః మగవాడే కనిపెట్టి వుంటాడు. అసలు సృష్టికర్తే, మగవాడుకదా! శాస్త్రకర్తా మగవాడేనాయె! బలే సూత్రం కనిపెట్టాడులే! ఆ సూత్రంమీదే నడుస్తోంది సర్వమూ.

ఆవు మెడలో పలుపు పెడితే ఎల్లా యజమాని వెంట, కిక్కురుమనకుండా వెంట వస్తుందో, అల్లాగే సూత్రం కట్టించుకున్న మహిళ, కట్టిన మగాణ్ణే అనుసరించవలసిందే. త్రాడు మెళ్లో వేసేటప్పుడు, పశువు, పెనుగులాడనన్నా పెనుగులాడుతుంది. మహిళ సంతోషంగా, తానే తనంత కట్టమని, సూత్రానికి తల వంచుతుంది. పైగా పబ్లిక్‌గా, వేలమంది జనంలో !"

"ఏమిటో యీ మాయదారి పెళ్లి ! పెళ్లి చేసుకున్న తర్వాత, మగడయిన తర్వాత ఊరుకుంటాడా ? యెన్నటికీ ఊరుకోడు. అసలు చేసుకునేదే అందుకాయె! వెంటనే పిల్లలు, అమ్మా ! అని పరుగెత్తుకుంటూ వస్తారు. ఇదంత జింజకానా ! కామాటం ! ఇవన్నీ గృహించుట్లూ, గృహిణిచుట్టూ, పెనవేసుకొని వుంటాయి. ఆడదానికి, యిల్లు బందిఖానా ! యివన్నీ ఇల్లాలి నెత్తినపెట్టి మగవాడు, హాయిగా, పూలరంగడల్లే, వీధిలో తిరుగుతూవుంటాడు."

"మగవాడు ఊరుకోడంటే, జ్ఞాపకం వచ్చిందర్రా ! ఒక హెడ్‌మిస్ట్రెస్, లేడీ టీచర్లను, టయిమయినా, యింటికి వెళ్ళనీయదట ! "అమ్మా ! మీరింటికి వెడితే, మీవారు మిమ్మల్ని యింటిదగ్గర కాంపొజిషన్ పుస్తకాలు దిద్దుకోనీయడం కల్ల ! పాపం ! మీరు మీవారినేమో, కాదనలేరు. కనుక, పని బకాయిలేకుండా, ఒక గంట యిక్కడే వుండి దిద్దుకుపొండమ్మా !

*(గత సంచిక తరువాయి)*

మీ మేలుకోరి చెబుతున్నాను" అని బుజ్జగించి, పని చేయించుకుంటుందిట ! ఇంటిదగ్గరేమో, పిల్లలు ఏడుస్తూవుంటారు. వాళ్లని, సముదాయించుకోలేక, భర్త వైరిముఖంపెట్టి, తలో బిస్కెటూ పడేసి, దారితెన్నులు చూస్తూ వుంటాడు. భార్య యింటికి రాగానే, స్కూలు వదలిపెట్టి ఇంతకాలం అయితే, ఎక్కడ సంచారం చేస్తున్నావని, భర్త దండిస్తాడు !"

పై విధంగా తలకొక విధంగా వారికి తోచినట్లు వారు మాట్లాడడం, కొందరు విరగబడి నవ్వడం జరిగిపోయింది.

"పాపం ! సురేఖమ్మ గతి ఏమయినదో తెలుసునా ? ఆమె పెళ్లి యెప్పుడో జరిగిపోయింది. భార్యకూ భర్తకూ సంబంధం లేదు. భర్త చదువుకోలేదు. భార్య చదువుకొని, చక్కగా ఉద్యోగం చేస్తూ, హాయిగా బ్రదుకుతోంది.

ఇక్కడ కథ యిల్లా వుండగా, అక్కడ ఆ మొగుడనే 'పదార్థం' మళ్ళీ పెళ్లి చేసుకొని, ఒక పిల్లవాణ్ణి కన్నది. ఆ రెండవ భార్య స్వర్గస్థురాలయింది. మూడవ పెళ్లి చేసుకునే దమ్ములేని ఆ మగడు, దివ్యదృష్టితో చూశాడు. మొదటిభార్య సురేఖ బ్రదికివున్నట్లూ, ద్రవ్యం సంపాదిస్తున్నట్లు గోచరించింది. హుటాహుటి విజయవాడ బయలుదేరివచ్చి — "సురేఖా ! నీవు నా భార్యవు. నేను నీకు భర్తను. ఇది మన భారతదేశం" అన్నాడట ! అంతే !

ఈ సాధ్వీమణి మెత్తబడిపోయి "నిజం, నాథా !" అన్నదట ! ఇప్పుడు తిరిగి వారు భార్యాభర్తలు ! కథ కంచికి మనం విజయవాడకు !"

ఈ కథాకథన వైఖరికి, కొందరు నవ్వాలని ప్రయత్నించారు. కొందరు బాధపడ్డారు. సురేఖ సరోజిని యింటిప్రక్క వుంటోందనీ, ఇద్దరికీ స్నేహమని చాలామందికి తెలుసుకనుక, దీనినిగూర్చి చర్చ పెద్దపెరుగలేదు. ఇంకొక ప్రసంగం నడిచింది.

"సురేఖ పిలవు పెట్టిందేం ?" అన్నది ఒకామె.

"ఇంకేం, దొరికాడుగా భర్త ! అక్కడకు వెళ్లివుంటుంది. అలభ్యం అనుకున్నది లభ్యమయిందిగా ! మళ్లీ చేజార్చుకుంటే ఎల్లా ?" అన్నది మరొక మహిళ.

"ఆమె ఆమె భర్త దగ్గరకు వెడితే మీకాక్షేపణ ఎందుకర్రా ! వెనకటి చరిత్ర త్రవ్వడం దేనికి ? ఆమెకు యిప్పుడే పెళ్లి అయినదనుకోండి. ఆమె వయస్సువాళ్లూ, యింకా పెళ్లికానివాళ్లూ, లోకంలో ఎందరు లేరు ? కనుక యిప్పుడే పెళ్లి అయి, క్రొత్తగా కాపురానికి వెళ్లిందనుకుంటే మన ప్రాణానికి సుఖం." -

"అల్లా ఎల్లా అనుకుంటాం ? మనకొక డిన్నరు పోలా ?" అందరూ నవ్వారు. కాని సరోజిని గంభీరంగా వుంది.

ఒక వయసు ముదిరిన కన్య సరోజిని దగ్గరకు వచ్చి కూర్చుంది.

ఆమె పేరు కోటమ్మ. అందరూ ఆమెను వృద్ధకన్య అంటారు. ఆమె దానిని ఒక గుణంగానే భావిస్తుంది కాని అల్లా అన్నందుకు ఏమీ అనుకోదు.

"మై డియర్ సిస్టర్ ! సరోజినీదేవీ ! నువ్వు ఏమయినాసరే, పెళ్లిమాత్రం చేసుకోవద్దు. నేను చూడు పెళ్లి లేకుండా వుండిపోలా ?" అన్నది నన్నగా.

"నీ వుండిపోవడం చట్టుబండలయినట్లుగా

**జరిగిన కథ-11 :** కొడుకు సూర్యానికి సరోజినిని యిచ్చి పెళ్లి చేయమని అన్న శేషయ్యని అడుగుతుంది చింపమ్మ. ఆస్థి, చదువు లేని సూర్యానికి సరోజినిని యివ్వటానికి ఒప్పుకోడు శేషయ్య. ఉన్న ఆస్థి సరోజిని చదువుకి కరిగిపోగా గత్యంతరం లేక హైస్కూల్లో టీచరుగా చేర్పిస్తాడు శేషయ్య. సూర్యం మంచి పురోహితుడుగా పేరు సంపాదించుకుంటాడు. ప్రయివేటుగా ఎం. ఏ. పూర్తిచేస్తుంది సరోజిని. తను తన భర్తకు ఎలా దూరమయ్యిందీ సరోజినికి చెప్తుంది తోటి టీచరు సురేఖ. సురేఖ తండ్రి మరణిస్తాడు. సురేఖపట్ల పెడసరంగా వుంటుంది వదిన గంగమ్మ. అన్న ఇంటినుండి వెళ్లిపోయి వేరే వుంటుంది సురేఖ. తండ్రి పోయినతర్వాత ఒంటరితనంతో బాధపడుతుంటుంది సరోజ. సరోజ ప్రోద్బలంమీద వెళ్లిన సూర్యం సురేఖ భర్త రెండో భార్య పోవటంతో ఆమెని స్వీకరించటానికి విముఖతగా లేడని తెలుసుకువస్తాడు. చింపమ్మ మరణిస్తుంది. సూర్యం ఉత్తరానికి సమాధానంగా సురేఖ భర్త రామబ్రహ్మం వస్తానన్న వేళకి సురేఖను ఇంట్లో వంటరిగా వుంచి బయటకు వెళ్లతుంది సరోజిని సూర్యం సలహాపై. సూర్యం వూహించినట్లే, సురేఖ రామబ్రహ్మంల మధ్య పొత్తు కుదురుతుంది. ఈ రోజుల్లో వేలకు వేలు కట్నాలు పోయందే పెళ్లిళ్లు కావని, సరోజిని సూర్యాన్ని వివాహం చేసుకోవటం ఉత్తమమన్న రామబ్రహ్మం అభిప్రాయాన్ని సరోజినికి విప్పిస్తుంది సురేఖ.

వుంది. నీ సంగతి తెలియనివాళ్లతో నీ గొప్పతనం చెప్పుకోవాలి!" అని మెటికలు విరిచి, ఒకామె ప్రక్క పంతులమ్మతో రహస్యంగా అన్నది. సరోజిని గమనించింది.

వృద్ధకన్య యింకా యిలా అంది :

"బ్రహ్మచారులుగా వుండే హక్కు మగధీరులకే ఎందుకుండాలి? మన మహిళలకు ఎందుకుండ కూడదు? ఇది పురుషుని పక్షపాతవైఖరికి నిదర్శనం కాదా? ఈ విషయం మనం తేల్చాలి! మనమూ స్వతంత్రులమని నిరూపించుకోవాలి!" అని బిగ్గరగా ఉపన్యాసధోరణిలో అంది.

కిటికీ ప్రక్కనుండి వెళ్లే ఒక స్టూడెంటు చెవిలో ఈ ఉపన్యాసం పడింది.

"పిల్లలను కనే హక్కు స్త్రీలకే ఎందుకుండాలి? పురుషుల కెందుకు వుండకూడదు?" అని బిగ్గరగా అరుస్తూ, వాడు గబగబా దాటిపోయాడు.

కొందరు నవ్వారు. కొందరు తెల్లబోయారు. కొందరు ఆ కిటికీ దగ్గరకు వెళ్లారు, ఆ అన్నవాడెవడో చూద్దామని. వాడు లేడు. గుంపులో అప్పుడే కలిసిపోయాడు.

"చూశారా? వేలెడుకూడా లేని విద్యార్థికి మహిళాలోకం అంటే ఎంత చులకనగా వుందో? వాడికి తాను మగవాడననే దురహంకారం ఎంత వుందో చూశారా? దేశం జనాభాలో యించుమించుగా సగం మనం వున్నాం. మనని కాదని ఎవరనగలరు? మగవాళ్లతో నిమిత్తం లేకుండా, మన భవిష్యత్తును మనం నిర్ణయించుకుంటాం."

"అమ్మా! యింత ఆవేశం వున్నదానవు, మనల్ని మహిళలనీ, మగవారిని ధీరులనీ ఎందు కన్నావు? మగవారిని ధీరులని ఎందుకు ఒప్పుకున్నావు? ఎవడో కుర్రకుంక, ఏదో వెటకారంగా, వాగి పరుగెత్తుకుపోతే, దానినంత 'సీరియస్'గా తీసుకుంటావేమిటి?"

"అమ్మా! ఏవో నవలలు చదవడంలో ఆ మాట, ధీరులన నా నోట వచ్చేసింది. ధీరత్వంలో మనకూ ఏమీ లోపం లేదు. మన దువ్వూరి సుబ్బమ్మగారు ధీరవారీమణి. ఈ అర్భకుడు నన్ను రెచ్చగొట్టాడు. ఇక స్త్రీ సంగతి నా ఉపన్యాసం వినండి. సృష్ట్యాదినుండీ ప్రధానురాలు స్త్రీ కాని, పురుషుడు కాదు."

"సృష్టి కసలు ఆది అంటూ లేదు. అది అనాది" అన్నదొకామె.

"ఇదే వచ్చింది మనలో. ఒకళ్ళంటే యింకొకళ్ళకు లక్ష్యంలేదు. ఎడ్డెమంటే తెడ్డెమనీ, ఏలూరంటే తెనాలి అనీ, అనేవారున్నారు కాబట్టే, పురుషుడి దౌర్జన్యం సాగుతోంది. ఒకళ్ళ గొప్పతనం ఒకరు ఒప్పుకోరు. అందుచేతనే క్రమంగా పశుబలాన్ని ఉపయోగించి, పురుషుడు ప్రధానుడయి కూర్చున్నాడు. ఇది చాలా అన్యాయం!"

"అన్యాయం" అని కొందరు నెమ్మదిగా డస్కులు గుద్దారు.

"అసలు దేవత ఆదిశక్తి, ఆమె స్త్రీ" అన్నది వృద్ధ కన్య.

## మగదిక్కు

"ఆ శక్తి స్త్రీ కాదు, పురుషుడూ కాదు" అన్నదొకామె.

"నన్ను చెప్పనియ్యరేం? స్త్రీ కాక, పురుషుడు కాక, ఆ శక్తి మూడవది అవుతుందా?"

మళ్ళీ కొందరు నవ్వారు.

"నేను చెబుతున్నాను మీరు నమ్మండి. ఆదిశక్తి స్త్రీ, మహిళ, నారి."

"మీరేమయినా ఆ శక్తిని చూసి చెబుతున్నారటమ్మా!" అన్నదొకామె.

"చూసింది. కంచి పట్టుచీర కట్టుకుని, దర్శనం యిచ్చింది." అన్నది మరొకసారి.

మళ్ళీ అందరూ నవ్వారు.

"అయితే, ఎక్కువ పురాణాలు, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను పెద్దలను చేశాయి." అని కొనసాగించింది వృద్ధ కన్య తన ఉపన్యాసం.

"అవి పురుషులు వ్రాసికొనివుంటారు" అన్నది ఒక లేమ.

"రైట్! అక్కడనుండి ప్రారంభం అయింది అన్యాయం. పురుషుడికి ఉచ్చస్థితి, స్త్రీకి పతనమూ, ప్రారంభం అయింది."

"హరహరా!" అన్నదొకామె.

"మళ్ళీ పురుష దేవత పేరే ఉచ్చరిస్తుంది!"

"కాదమ్మా! హరుడు అర్ధనారీశ్వరుడు. స్త్రీ పురుషులకు సమాన హక్కులు కలవనేదానికి ప్రతినిధి."

"ట్రూ ట్రూ! వేదకాలంలో స్త్రీ పరిస్థితి యింత అన్యాయంగాలేదు." అని కొనసాగించింది వృద్ధ కన్య.

"అసలు వేదకాలమంటూ లేనేలేదు. మన చారిత్రికులు దానిని కల్పించారు" అన్నదొకామె.

"ఇలా మాటిమాటికీ అడ్డం తగులుతూ వుంటే నేనే కాదు— యెంత మగవాడయితేమాత్రం, ఉపన్యాసం చెప్పగలడా?"

"మళ్లీ పురుషాధిక్యతను అంగీకరిస్తున్నారు."

"లేదు. లేదు. ఉపసంహరించుకుంటున్నాను. ఐ విత్ డ్రా. చెప్పే హక్కు వున్నవాళ్ళకు, ఆ వాక్యాన్ని ఉపసంహరించుకునే హక్కు కూడా, వుంటుంది."

"ఇవాళ బండి అంతా హక్కుల మీద నడుస్తోంది" అన్న దొక భామ.

"స్త్రీలలో, గార్గి, లోపాముద్ర, మొదలైన మంత్రద్రష్టలున్నారు. మైత్రేయి వంటి బ్రహ్మవాదిను లున్నారు. అసలు విద్యకు అధిష్ఠాన దేవత, మన మహిళ, సరస్వతి."

"అంటే మన స్కూలులో టీచరా? మన మహిళ అంటున్నారు."

కొందరు నవ్వారు.

"ఆ వాగ్దేవి అనుగ్రహం లేకపోతే, యెంత పురుషుడయినా, అతనికి నోట మాటే రాదు. అల్లాంటి పురుషుడు; స్త్రీ అనుగ్రహం వుంటేనే కాని, నోరెత్తలేని పురుషుడు, క్రమంగా, తన వాక్కుచేత, భుజబలంచేత, మహిళనే శాసిస్తున్నాడు. ఎంత అన్యాయం! స్త్రీని వేదం చదువకూడదన్నాడు. పురాణాలు చదువుకొమ్మన్నాడు. స్త్రీ తన ప్రక్క కూర్చొని ఆచమనోదకం చేస్తేనేకాని, కర్మ ప్రారంభించలేని పురుషుడు, స్త్రీకి కర్మాధికారంలేదు పొమ్మన్నాడు. ఎంత అన్యాయం!"

"అతి ఘోరం" అన్నదొక భామ.

"ఘోరాతి ఘోరం!" అన్నదొక భామ.

"కౌసల్య మొదలయినవారంతా, నెమక సంధ్యావందనం చేసినవారు."

"మీరు చూశారుగా!" అన్నదొకామె!

"ఎవ్వరూ చూడరమ్మా, గ్రంథాలనుబట్టి తెలుసుకుంటారు. ఆమాత్రం తెలుసుకోలేకపోతే యెల్లా? ఆమె చేసిందనిమాత్రం బల్లగుద్ది చెప్పగలను."

"నోరు చాలమ్మా. బల్ల గుద్దకు."

"మీరు సంధ్యావందనం చేస్తున్నారా? చేసే హక్కు వున్నదని వుద్ఘాటిస్తున్నారుకదా!"

"పాపం! ఆమె ఏమి చేస్తుంది? ఉపనయనమే చేసుకోలేదుకదా!" అన్నది మరొక మహిళ.

"అదే — నేను చెప్పబోయేది! మగవాడు ఏ ఆడదానినయినా ఉపనయనం చేసుకొని, యజ్ఞోపవీతం వేసుకోనిస్తున్నాడా? స్త్రీ నెత్తిని కత్తి తగలకూడదని చెబుతూ, తన భోగం కోసం జుట్టు పెంచుకోమంటున్నాడు. షేమ్!"

"షేమ్, షేమ్"

"దానిలోకి తాను తెచ్చియిచ్చిన పూలు పెట్టుకోమనీ, రాత్రి గదిలోకి సిద్ధంకమ్మనీ అంటున్నాడు. ఛీ! అసహ్యం!"

"కాస్త కూస్తా? వృద్ధకన్యకు ఆముదం త్రాగినంత అసహ్యం పురుషుడంటే!"

"కరెక్ట్"

కొందరు పంతులమ్మలు మెత్తమెత్తగా చప్పట్లు కొట్టారు ఇంతట్లో గంట కొట్టారు. మిగతా ఉపన్యాసం రేపటికి వాయిదా వేశానని చెప్పింది వృద్ధకన్య

## 30

వృద్ధకన్యవంక చూసి ఒకామె :

"అమ్మా? రాత్రి అంతా ఆలోచించాను. చదువులకు రాణి సరస్వతి కదా! మరి ఆడవాళ్లకంటె మగవాళ్లకు విద్య ఎందుకు వస్తోందా? అని. ఆ సరస్వతిని మగవాడు బ్రహ్మదేవుడు నోట్లో బెల్లమ్ముక్క పెట్టుకున్నట్లు పెట్టేసుకున్నాడు. అక్కడనుండే వేదాలు చెప్పడం ప్రారంభించాడు" అంది.

"నిన్న చెప్పవలసింది యివాళ చెప్పావు. నేను ఒప్పుకోనంటే ఒప్పుకోను" అన్నది వృద్ధకన్య.

"మేమూ ఒప్పుకోము" అన్నారు చాలామంది.

దానితో వృద్ధకన్య ఉత్సాహం రెట్టింపయింది.

"తల్లీ! నువ్వు పెళ్లి చేసుకోలేదు. చేసుకోమని నిన్నెవ్వరూ బలవంతం చేయలేదు. యిచ్ఛగా నీ మనస్సుకు తోచినట్లుగా నీవు చేస్తున్నావు. నీవు స్వతంత్రురాలవు. నువ్వు యిప్పుడు పురుషుడికి చెంపపెట్టుగా వుండడంకోసం, వడుగు చేసుకొని జందెం ఎందుకు వేసుకోవు?" అని అడిగిందొకామె.

"ఏమిటే, ఈ అడ్డసవాళ్లు! బాగానే వుంది! నిన్నటినుండి చూస్తున్నాను. ఎదురు ప్రశ్నలు వేయడం తప్ప చెప్పింది గ్రహించడంలేదు. మనలో

మనకే ఒకరిమీద ఒకరికి అసూయ వుంటే, మనం ఎల్లా పైకి వస్తాం ? నన్ను వుపన్యాసమే, చెప్ప నీయరాయె !''

''ముదితల్ నేర్వగరాని విద్య కలదే ముద్దార నేర్పించినన్'' అన్నట్లు మనకు ఏమి చదువు చెప్పిస్తే రాదు ? ఆదికాలంలో ఆడవాళ్లంతా చదువుకున్నవాళ్లే. విజయాంక, విద్య, ప్రభాదేవి, సుభద్ర, గంగాదేవి, తిరుమలాంబ, మధురవాణి, ప్రియంవద, రామభద్రాంబ – వీళ్లంతా చక్కగా సంస్కృతం చదువుకున్న మహిళామణులు, నారీశిరోమణులు, స్త్రీ రత్నములు.

ఇంకా, దేవుడు మేలు చేస్తే, తెలుగులో, తాళ్లపాక తిమ్మక్క, తరిగొండ వెంగమాంబ, కృష్ణాజీ, మోహనాంగి, మొదలైనవా రెందరెందరో వున్నారు. అందరికీ వందనములు'' అని దణ్ణం పెట్టేసింది వృద్ధకన్య.

''ముద్దుపళని కవిత్వం ఎంతో ముద్దుగా వుంటుంది'' అంది.

''ముద్దు కాదమ్మా ! ముద్దు ముద్దుగా వుంటుంది. ఒక ముద్దు ఆమె కవిత్వానికి సరిపోదు'' అన్నదొకామె.

''పోనీ, అలాగే ! రెండు ముద్దులు మాత్రం సరిపోతాయా ? కవిత్వం అంతా ముద్దులే !''

అందరూ మెత్తమెత్తగా చప్పట్లు కొట్టారు.

''తల్లీ ! కవిత్వం అంతా ముద్దులే అన్నావు కదా ! నేను ఆ పుస్తకం చదువలేదు. అందులో మగవాళ్లకీ ఆడవాళ్లకీ ముద్దులా ? ఆడవాళ్లకీ ఆడవాళ్లకీ ముద్దులా ? పెళ్లి అయినవాళ్లకి ముద్దులా ? పెళ్లి కానివాళ్లకు ముద్దులా ?''

''కవిత్వం ముద్దుగా వుందని చెప్పడానికి పుస్తకం చదవాలా ? ఆమె పేరే ముద్దుపళనికదా ? కవిత్వం ముద్దుగా ఉండదూ. అంతా ముద్దుగానే వుంటుంది.'' అన్నది వృద్ధ కన్య.

ప్రశ్నించిన ఆమె మరి మాట్లాడలేక పోయింది.

''రంగాజీ కవిత్వం, రసం, రంగరించినట్టుగా వుంటుంది'' అన్నది వృద్ధ కన్య.

''రసం అంటే ఏ రసం ? మనం అన్నంలో పోసుకునేదా ?''

''కాదు.''

''రసకర్పూరమా ?''

''రసం అంటే తెలియదూ ? రసం, రసం, రసం.''

''పాదరసమా ?''

''ఏమిటది ? అర్థంకానివాళ్ళకు యెల్లా చెప్పేది ?''

''ఎల్లా అర్థమవుతుందమ్మా. రంగరించి అంటే అదేదో మందేమో అనుకున్నాను.''

''మందు కాదు. అంతవరకు గట్టిగా చెప్పగలను.''

''రసతరంగిణి, రససముద్రం, అల్లాంటి దాంట్లో రసం'' అంది ఒకామె.

''కరెక్ట్'' అన్నది వృద్ధ కన్య.

''కాని రసతరంగిణి అవి అంటే ఒప్పు కుంటాను. రససముద్రం, రసవార్నిధి – యివి ఒప్పుకోను. ఎందుచేతనంటే కవులందరూ, నదులన్నీ స్త్రీలనీ, సముద్రుడు ఒక్కడూ పురుషుడనీ అన్నారు. ఇంపోసబుల్ ! అంతమంది స్త్రీలూ ఒక్కడే పురుషుడూ వుండడానికి వీలులేదు. అందుచేత ఆ మాటలు నాకిష్టంలేవు. సరే అది వదలివేయండి. మొల్ల కవిత్వం అంతా మొల్లల వాసనే !'' అంది ఉపన్యాసం కొనసాగిస్తూ.

''అబ్బ ! అబ్బ !'' అన్నది ప్రక్క ఆమె యింకొకప్రక్కకు తిరుగుతూ.

''ఏమి మొల్లపుష్పముల వాసన అసహ్యకరంగా వుంటుందా ?'' అని ప్రశ్నించింది వృద్ధ కన్య.

''తల్లీ ! నేను పూలవాసన కసహ్యించుకో లేదు. మల్లెలూ, మొల్లలూ యెవరూ అసహ్యించు కోరు. కాని నీ నోటి తుంపురులు నామీద పడుతున్నై. నువ్వు ఉపన్యాసం మొదలుపెట్టింది సరోజనమ్మకోసం. బహుశః నీ ఉపన్యాసం ఇవాళ ఉంటుందని కాబోలు ఆమె యీ ఇంటర్వల్‌లో యిక్కడకు రాలేదు నా ప్రాణంతీస్తున్నావు. నీకు పుణ్యం వుంటుంది. అటు తిరిగి చెప్పు.'' అన్నది ప్రక్కనున్న పంతులమ్మ.

''మానర్‌లెస్ !'' అని నెమ్మదిగా అంటూ తన ఉపన్యాసాన్ని వృద్ధ కన్య గబగబా కొనసాగించింది !

''ఇంకా, ఇతర రంగాలలో, రాణీ దుర్గావతి, చాంద్‌బీబీ, అహల్యాబాయి, మల్లమ్మ, మాంచాల, శీలమ్మ, చానమ్మ, నాగమ్మ, రుద్రమ్మ, శాంతిశ్రీ – మొదలైనవారూ, సరోజినీదేవి, విజయలక్ష్మి పండిట్, ఇందిరాగాంధీ, కమలాదేవి



ఛట్టోపాధ్యాయ, దుర్గాబాయి దేశ్‌ముఖ్, కమలా నెహ్రూ, కస్తూరిబాయి గాంధీ, సుచేతా కృపలానీ, అరుణ అసఫలీ, కల్పనా జోషి, రాజకుమారి అమృతకౌర్, నందినీసత్పతి, పద్మజానాయుడు, సరోజినీమహిషి, నాగరత్నమ్మ మొదలైనవారెందరో వున్నారు. తోరుదత్, మహాదేవివర్మలస్థానం, సాహిత్యంలో విశిష్టమైనది. ఇంకా అమృతా ప్రీతమ్, సుభద్రాదేవి చౌహాన్ మొదలయిన వారెందరో వున్నారు.''

“ఆంధ్ర రచయిత్రులను చెప్పలేదేమి ?” అన్నదొకామె.

“చెప్పాను. ‘ మొదలయినవారిలో ’ వారున్నారు. మన రచయిత్రుల జాబితా పెద్దది. అందుచేత ఆవిధంగా చెప్పాను.”

“ఈ ఉపన్యాసం అంతా ఎప్పుడు కంఠస్థం చేశావమ్మా !” అని అడిగిందొకామె.

“ఇంతోటిదాన్ని కఠస్థం చేయాలామిటి ? యెప్పుడూ అందరూ చెప్పే మాటలేగా ! నాలుగుమాట్లు జాగ్రత్తగా వింటె రాదా ఏమిటి?” అని సమాధానం చెప్పింది.

ఉపన్యాసం మళ్లీ కొనసాగించింది.

“ఇంతకీ నేను చెప్పేదేమంటే, మిగతా కొన్ని దేశాలకంటె మన భారతదేశం చాలా మెరుగు. కొన్ని దేశాలలో స్త్రీలకు ఓటు చేసే అధికారమే లేదు. మన దేశంలో గట్టిగా వుంది. కాని, మనం యింకా పురోగమించవలసివుంది.

నేను చెబితే మీరు నమ్మరుకాని, పురుషుడు దురహంకారి. ఆడవాళ్ళను యెక్కనివ్వడు, పదవుల్లోకి.”

“అమ్మా ! చిన్న చదివావే పద్యపాదం — ‘ముదితల్’ అని అది వ్రాసింది మగవాడా ? ఆడదా ?” అని అడిగింది ఒకామె.

“మగవాడే.”

“ఆడవాళ్ళకు విద్య కావాలనీ, వాళ్ళకు కొన్ని సౌకర్యాలూ, ఓటు హక్కు మొదలైనవి కావాలనీ, యీ దేశంలో మొదటిసారిగా ప్రచార ప్రబోధాలు గావించింది పురుషులా ? స్త్రీలా ?”

“పురుషులే అనుకోండి.”

“అయితే పురుషులు స్త్రీలను అణగద్రొక్కడం ఏముంది ?”

“మనము కొంతవరకు మాత్రమే ఎదగడం వారి కిష్టం. ఆపైన ఎదిగి వారితో పోటీ చేయడం వారి కిష్టంలేదు. వారి యిష్టాయిష్టాలమీద మనమేమీ ఆధారపడిలేము. దేశ జనాభాలో మన బలం మనకుంది.”

“అంటే ఏదయినా పోటీ వస్తే ఆడవాళ్లంతా ఒక ప్రక్క, మగవాళ్లంతా ఒక ప్రక్క చేరి, పోటీ చేయాలని నీ ఉద్దేశమా ?”

“ఇవన్నీ పిల్లి ప్రశ్నలు !”

“రాజకీయ పక్షాలలో నేడు ప్రముఖ స్థానం స్త్రీలు కూడా పొందుతున్నారుకదా ! ఆ స్థానానికి ఎన్నుకున్నవాళ్లలో పెద్ద మెజారిటీ పురుషులేనే ? కనుక ఒక స్థానానికి ఎన్నుకోవేటప్పుడు, సామర్థ్యాన్ని దృష్టిలో పెట్టుకుచూడవలెను కాని, స్త్రీయా, పురుషుడా ? అని చూడవచ్చునా ? అదే భావం పురుషజాతికి వుంటే, స్త్రీని పదవికి రానీయడం జరుగనే జరుగదుకదా ! అల్లాగే పురుషుల మానేజ్‌మెంటు ఉన్న విద్యా సంస్థలలో స్త్రీలను టీచర్లుగా వేసుకోకపోవచ్చుకదా !”

## ఉగాది స్వాగతం

— “సుచంద్ర”

జగాని కంతకు జాగృతినీయగ
ఉగాది వచ్చెను ఉల్లాసముగను
మామిడి చిగురును మేసిన కోయిల
మత్తిలిపాడెను మధురగీతులను
నవపల్లవ కుసుమవల్లరి
నవనవమై వికసించెను నేడు
తూరుపు దిక్కున తోచిన సూర్యుడు
వేడిని యిచ్చెను వేడుక లరగ
చైత్రలక్ష్మి సర్వాంగములందున
చేతనత్వములు పొంగిపొరలెను. ॥జగాని॥
మంచి గతమున కొంచెమేనను
నీరసాలకు నతుల నొసగుచు
నవ్యజీవన ప్రగతిపాత్రల
నవరసాలను నింపుకొందాం.
ఆరు రుచుల వేపపచ్చడి
ఆరగించుచు నేడు మనము
ఆటపాటల నోలలాడుచు
చైత్రలక్ష్మికి నమసులిద్దాం.

## మగదిక్కు

“మీరంతా పెళ్లిళ్ళు చేసుకుని కులుకుతున్న వారు. కాపురాలు చేస్తున్నవారు. మగజాతి మీద ఈగ వాలనివ్వరు. వాలకముందే తోలేస్తారు. మగవాడి మాయలో పడిపోయి, స్వతంత్రమైన ఆలోచనాశక్తిని కోలుపోయినవారు. ఒకవిధంగా చెప్పాలంటే, పురుషునికి ఛాయగా బ్రదుకుతున్న వారు.

మీలో చాలామంది, అసలు స్వతంత్రమైన ఆలోచనలు చేయవలసినవాడు మగవాడేననీ, ఆడది ఊరికే పురుషుణ్ణి అనుసరించవలసినదేననీ, లేదా సలహా యివ్వవలసినదేననీ, అనుకునే మందబుద్ధి వున్నవాళ్ళు. కష్టార్జితమైన సంపాదన తీసుకువెళ్లి మొగుడు దోసిట్లో పోసి, మీ జన్మం చరితార్థం అయినదనుకుని సంతోషించేవాళ్ళు.

సంపాదిస్తూకూడా మీ కాళ్లమీద మీరు నిలబడలేక, మగదిక్కుకోసం, దేవురించే చవటలు. మీ డబ్బుపెట్టి, మగాడికి వచ్చిన చీర మొగుడు కొనుక్కొస్తే కట్టుకొని, ఆ పురుషుడు సంతోషిస్తే చాలునని తృప్తిపడే వాజమ్మలు. స్త్రీ వేరు పురుషుడు వేరు అని గ్రహించలేని దద్దమ్మలు.”

“ఏమమ్మోయి ! నీ నోటికి హద్దూపద్దూ లేకుండా పోతోంది. నా మొగుడుకూడా నన్ను యెప్పుడూ ఒక్క మాట అనలేదు. నా సంపాదన ముట్టుకోకుండా, తన సంపాదనలోనే ప్రతి పండుగకూ చీర కొనిపెడతారు. వేటకొలానికి దద్దమ్మనీ వాజమ్మనీ చవటనీ, ఈవిడ చేత పడవలసివచ్చింది.” అని మొట్టమొదట ఆమెమీద కోపంతో గద్దిస్తూ ప్రారంభించి, ఏడవడం ప్రారంభించింది ఒకామె.

“ఆదేమిటమ్మా ! నేనూ ఆడదాన్నే. నాకూ మగపిల్లలూ వున్నారు, ఆడపిల్లలూ వున్నారు. ఎవరిని శిక్షించేవిధంగా వారిని శిక్షించుకుని వాళ్లను వృద్ధిలోకి తీసుకువస్తాం. మా వారికి అసలు ఆడపిల్లలంటేనే ఎక్కువ ముద్దు. నాకు మగపిల్లలంటే ముద్దు. ఏమిటీ ఆడజాతి అనీ, మగజాతి అనీ, వేరుచేసి, ఏరేదో రాజకీయపక్షాలవారయినట్లూ, ఎవరిమీద ఎవరు గెలవడమా అన్నట్లూ, మాట్లాడుతుందేమిటి ? యీమెలేనిచోటు. గంటు పెట్టినట్లు, తగాదా లేనిచోట తగాదా సృష్టిస్తుం దేమిటి ? ఆడది లేనిది మగవాడెక్కడున్నాడు ? మగవాడు లేనిది ఆడది ఎక్కడ వుంది ? యీ పద్ధతిలో ఎవరు ముందో యెవరు చెప్పగలరు ? విత్తు ముందా, చెట్టు ముందా ? అని అడిగితే చెప్పగలమటమ్మా. విత్తుకు చెట్టు ముందు, చెట్టుకు విత్తు ముందు. అల్లాగే ఆడా, మగా, అని విడదీస్తే జగత్తు సాగుతుందా ?”

“వింటూనేవున్నా ! మీరు మగవాళ్లకు బానిసలు. తమ పేరుతో వేరే బాంక్ అక్కౌంటు కూడా ఓపెన్ చేసుకోలేనంత చేతకానివాళ్ళు, మగవాళ్ళచేత అణగద్రొక్కబడే దీనాతిదీనమైన చరిత్ర మీది. పెళ్లి అనే పేరుతో, జీవితాంతం మగవాడికి, వెట్టిచాకిరీ చేయడంకోసం, స్వయంగా సిద్ధపడ్డ గాడిదలు !”

“మళ్ళీ యిటు తిరిగావేమిటమ్మా ! నీనోటి తుంపురులతో చస్తున్నాము.” అని పెద్దగా అరిచింది ప్రక్కనున్న ఆమె.

ఇంతలో సరోజిని అక్కడకు వచ్చింది.

“సరోజినికి హితోపదేశం చేయాలని ఉపన్యాసం ప్రారంభించి, మమ్మల్ని గాడిదలంటావేమిటమ్మా” అన్నది ఇంకొక టీచరు.

“నేను ఎంతోకాలంనుంచీ చెబుతున్నాను. పెళ్లి చేసుకోవడమనేది మూఢవిశ్వాసమని.”

“నేను ఒప్పుకోను. పెళ్లి చేసుకోవడం జ్ఞానసంకల వాళ్ళు చేసే పని. పెళ్లి వద్దనేవాళ్ళే మూఢత్వం వున్నవాళ్ళు. వాళ్ళదే, మూఢవిశ్వాసం” అనేసింది ఒకామె, కడుపుమండి. వృద్ధ కన్య ఉపన్యాసంలో ఆమెకు తగిలే భాగాలు ఉన్నాయి.

ఇంత ఉపన్యాసం అనర్గళంగా చెప్పిన తర్వాత, ఎదురుతిరిగి, తాను మూఢవిశ్వాసమని అంటే, తన మాట తనకే అప్పగించిన ఆమెమీద, వృద్ధ కన్యకు బాగా కోపం వచ్చింది.

“నీదే మూఢవిశ్వాసం. నువ్వే మూఢురాలవు.”

“నువ్వే మూఢురాలవు.” అని ఆమె లేచింది.

[ ఇంకా వుంది ]



మల్లాది వెంకటకృష్ణమూర్తి

# వీలునామా

చక్రపాణి ప్రాజ్ఞుడు. తెలివయినవాడు, మంచివాడు, ఇది లోకాభిప్రాయం. అంతేకాదు — ఐశ్వర్యవంతుడు. రెండు జూట్‌మిల్లులకి, ఒక కాటన్‌మిల్‌కి, మూడు షుగర్ ఫేక్టరీలకి, భారత దేశంలోని నాలుగు పెద్ద నగరాల్లో నాలుగు పెద్ద భవనాలకి అధిపతి. అనేక కంపెనీల్లో షేర్లు, డిబెంచర్లు వున్నాయి.

చక్రపాణికి ఈ లోకంలో తీరని కోరికలంటూ బహుశ వుండవేమోననుకుంటారు అతని కంపెనీల్లో పనిచేసే వుద్యోగులు. అందంగా వుండకపోయినా, చక్రపాణికి ఓ మంచి భార్య వుంది. చాలా భాగం ఆస్తి ఆవిడవల్లే కలిసివచ్చిందంటారు. అసలు చక్రపాణికి మొదట్లో ఏం లేకపోతే, మామగారి దూరపు బంధువుగాబట్టి చేరదీసి, కూతుర్ని, ఆస్తిని కట్టబెట్టాడు అంటారు కొందరు.

చక్రపాణి తన నలభై రెండో ఏడు దాటాక, సరిగ్గా నాలుగు నెలల ఆరు రోజుల తర్వాత ఓ రాత్రి తన ఆఫీస్ గదిలో ఆస్తి తాలూకు కాగితాలు చూస్తూ వాటిమధ్య కుప్పలా కూలాడు. డాక్టర్ చెవర్లెట్ కారులో వచ్చి, 'ఇక లేదు' అని స్థిర పరిచాడు.

ఆ తర్వాత మొదట ఆ ఇంటికి వచ్చింది లాయర్. చక్రపాణి భార్యకు ధైర్యం చెప్పి అన్ని ఏర్పాట్లు స్వయంగా చూడసాగాడు. మర్నాడు చక్రపాణి గౌరవార్థం ఆ నగరంలోని ఛేంబర్ ఆఫ్ కామర్స్ సభ్యులు సంతాపసూచకంగా మీటింగు ఏర్పాటు చేసారు.

నెల రోజుల తర్వాత చక్రపాణి లాయర్ — ఆయన ఆప్తమిత్రుడు — చక్రపాణి భార్యకి ఆయన వ్రాసిన విలునామా కాపీని పంపాడు. కొద్దిగా పనుండటంవల్ల ఢిల్లీ వెళ్తున్నానని, వచ్చాక కలుస్తానని మొహం చాటేసాడు.

చక్రపాణి భార్య విల్లు చదువుకుంది. చదువుతున్నకొద్దీ ఆవిడ ఆనందం ఎక్కువయింది.

"నా పేర వున్న రెండు జూట్‌మిల్స్ తాలూకు షేర్లు, ఒక కాటన్‌మిల్ తాలూకు షేర్లు, మూడు షుగర్ ఫేక్టరీల తాలూకు షేర్లు, బొంబే, ఢిల్లీ, మద్రాస్, కలకత్తాలలోని నా పేర వున్న గెస్ట్‌హౌస్‌లు నాలుగు, వివిధ కంపెనీలలోని షేర్లు, డిబెంచర్లు, యూనిట్ ట్రస్ట్ ఆఫ్ ఇండియాలోని యూనిట్స్, బేంక్ బేలన్సులు (వీటి వివరాలన్నీ విల్లులో యివ్వబడ్డాయి మొత్తాలతోసహా) అన్నీ నా భార్యకి చెందుతాయి.

కాని ఒక షరతుమీదే అవి నా భార్యకు చెందుతాయి. ఆ షరతేమిటంటే — నేను బ్రతికుండగా నాకు తీరని కోరిక ఒకటి మిగిలిపోయింది. అది యింట్లో, ముఖ్యంగా భోజనానంతరం, సిగార్స్ తాగాలన్న కోరిక. నా భార్యకి సిగార్ పొగ పడదు కాబట్టి, బలవంతంగా నాచేత ఆ పని చేయకుండా మాన్పించింది మా పెళ్లయిన మొదటిరోజునుంచే! నా కోరికని అపుకోలేక టాయ్‌లెట్‌లోకి వెళ్లి రహస్యంగా తాగిన సందర్భాలున్నాయి. ఆ కారణంగా, ఈ విషయంలో నాకు నా భార్యంటే పరమ అసహ్యం వేస్తోంది. నాకు లభ్యమయ్యే ఒకానొక అమితానందాన్ని బలవంతంగా అణచివేసింది నా భార్య. నేను ఎన్నివిధాల బ్రతిమాలుకున్నా వినలేదు.

ఈ కారణంచేత, నా భార్య, రోజుకి పది సిగార్‌లు త్రాగే పక్షంలోనే నా ఆస్తికి ఆవిడపైన పేర్కొన్న విధంగా హక్కుదారు అవుతుంది. అలా త్రాగని పక్షంలో, నా ఆస్తిలోంచి ఆవిడకి ఒకే ఒక్క రూపాయ చెందుతుంది సంవత్సరానికి. మిగతాది నా పేర ఒక ట్రస్ట్ ఏర్పాటు చేసి, ఆ ట్రస్ట్‌ద్వారా దేశంలోని సిగార్స్ త్రాగే ప్రతీవాళ్లకి నా పేర వారానికి ఒక సిగార్ పెట్టె వుచితంగా పంచిపెట్టాలి. ఇది నా అంతిమ కోరిక."

## వల్లని వసంతం



— "సస్యశ్రీ"

వచ్చింది వసంతం అంటే నాకు
వల్లమాలిన వళ్లు మంట
అస్థిరమైన పక్షాలమీద వస్తుంది;
అధరాలపై మధువును అద్దుకుని,
అన్నెంపున్నెం ఎరుగని పారిజాతాన్ని హత్తుకొని,
కవ్వించి కన్నెరికం చేస్తుంది.
తనువెల్లా తొలకరించిన అమరతరువు
పులకకో పుట్టెడు పూలు పూస్తుంది.

నిన్న రాత్రి పుట్టిన పూపాపలు
కన్ను నిండుగా తెరవకుండానే;
అదేమి వినోదమో మరి
అరుణోదయం కాకుండానే;
నేల రాలిన పారిజాతాలపై,
లీలగా అడుగులకు మడుగులొత్తుకుంటూ,
మరో మాలతి వద్దకో మాధవి వద్దకో చేరుతుంది
మట్టిపాలుచేసిన సుమనస్సులం మరచిపోయి!

వనమంతా తనదే అనుకునే వసంతానికి
మనసు ఏ ఒక్కరిమీదా మరు నిముసము నిలువదు
నిమ్న చూచి నోటితో నవ్వుతూనే
నొసటితో వెక్కిరిస్తుంది!
నిన్న కన్న కసరు మొగ్గలనుకూడా
కాలితో కెక్కరిస్తుంది.
అందుకే ఆమని అంటే అది ఒక వింత రక్కసి!
అందుకే నాకు ఆ ఋతువంటే అంత అక్కసు!!

# పరిచయ్ హిందీ నటుడు జితేంద్రాతో కబుర్లు: వీరాజీ


ఫొటో : [శ్రీ జయ]

అసలా సాయంకాలం – 'జితేంద్రా' (33)తో నేను 'కబుర్లు' చెప్పేద్దాం అనుకున్నప్పుడు – రేఖా, జితేంద్రాల మీద 'పాట' పిక్చరైజేషన్ వుందని నాకు తెలియదు– జితేంద్రాకి కూడా తెలియదు... అనుకోకుండా బెజవాడ బస్స్టాండుకు ఎదురుగా వున్న పెద్ద హోటలు (మమత) లోని ఆరో అంతస్తు 'డాబా' మీద "దిల్‌దార్" [హిందీ] సినిమా షూటింగ్ జరుగుతోంది...

హిందీ నటులలో కొంతమంది మాత్రం తెలుగు దేశంలో చాలా పాప్యులర్... వాళ్లల్లో జితేంద్రాకూడా ఒక "మ్యాటనీ ఐడల్"

"కారవాన్" చిత్రం మన ప్రాంతాల్లో బాగా ఆడింది – "మాస్" ప్రేక్షకులు, టీనేజర్స్ బాగా చూశారు. 'ఖుష్ బూ' చిత్రం కూడా అనుకున్న కన్నా బాగా మన "క్లాసు" ప్రేక్షకులు ఆదరించారు. ఈ రెండిటిలోను 'జితేంద్రా' కథానాయకుడు.

జితేంద్రా అన్నాడు "ప్రేక్షకులు 'మంచి' దైతేచాలు ఆదరిస్తారండీ" అని – 'మంచి' మనం వాళ్లకి అందించడంలోనే వుంది సినిమా 'సక్సెస్' రహస్యం' అని.

ఇక్కడ 'గుడ్' అంటే 'మంచి'గా అంటే 'బాగా' అని అర్థం చెప్పుకోవాలి. బాగా తియ్యడం – బాగా చెయ్యడం యివి బైస్కోపు విజయానికి రెండు చక్రాలన్న జితేంద్రా నమ్మకం – ఎట్లా అమలు చేశాడా అన్నదే మన అనుమానం... నేనడిగాను అందుకనే...

ఉదాహరణకి అతని 'పరిచయ్' గురించి చెప్పాడు – 'పరిచయ్' చిత్రం (సౌండాఫ్ మ్యూజిక్ యిన్స్పిరేషన్) దేశం మొత్తంమీద బాగా ఆడింది.

జితేంద్రాని యీ చిత్రంలో గుల్‌జార్ ఒక కొత్త 'మూస'లో, కొత్త 'భావనా' పటిమ చూపవలసిన పాత్రలో చూపించాడు! దాన్ని నిర్మించి మరీ రుజూ చేశాడు జితేంద్రా.

జితేంద్రా ఇమేజ్ అంతవరకు వేరు... ఆటు తరువాత మారింది. వైవిధ్యం గల పాత్రలు చేయగలడన్నారు.

బైట్‌ప్యాంట్, ఓపెన్ జెర్కిన్, మీసం లేని మూతి [బై ది బై రామానాయుడు చిత్రం దిల్‌దార్‌లో జితేంద్రాకి సన్నని మీసకట్టుంది] ఆడుతూ పాడుతూ, హీరోయిన్‌ని వెంటాడుతూ – 'మూడే ముచ్చట్లు – ఆరే గుద్దులు' మార్కు 'రోల్స్'లో 'ప్లేబోయ్' గెటప్‌లో కనపడే జితేంద్రా 'పరిచయ్'లో గంభీరమైన పాత్రలో అగపడ్డాడు. "దాట్‌వాజ్ గుడ్... పీపల్ హావ్ యాక్సెప్టెడ్" అన్నాడు.

## "గుల్‌జార్"నీ నేను మారుస్తున్నాను.

1964లో "గీత్ గాయా పత్థరోంనే" చిత్రంలో శాంతారాంగారి ముద్దులపట్టి 'రాజశ్రీ' సరసన వెండితెరమీదకి ఎక్కిన 'జితేంద్రా'కి 70 సినిమాలు పూర్తి అయినాయి...

నిజం చెప్పాలీ అంటే అతని 'బైప్డ్' రోల్స్‌లోనే ఆమధ్య యంగ్ ముఖర్జీలు, యంగ్ కపూర్‌లు వీళ్లంతా రావడంతో "జితేంద్రా" "నేను వెనుకపడిపోయానా ? అన్న భయంతో – శిరోజాలంకరణ, దుస్తులధారణ లాంటివి మార్చి వెరైటీ పాత్రలు వేద్దామా ? అనుకున్నాడు... [ఈలోగా శ్రీధర్ తీసిన చిత్రం, హేమ్మామాలిని వున్నా ఏవరేజ్‌గా పోయింది] కాని ఉత్తరాది ప్రేక్షకులలో ప్రతీ ఒక్క హీరోకి వొక "వేష–భాష" వుంటుంది. దాన్ని మార్చడం సినీ బ్రహ్మతరం కాదు... హీరోలకి కూడా దమ్ములుండవ్ ! కాని "పరిచయ్" గుల్‌జార్ క్రెడిట్.

జితేంద్రా ఆ సాహసం సొంత సినిమా "ఖుష్ బూ"లోనే చేశాడు. ప్రక్కనే హేమ్మామాలిని వుంది. కాని ఆ అమ్మాయి యిమేజ్‌ని కూడా మార్చాడు బాసు ఛటర్జీగారు.

"ఖుష్ బూ"లో పంచె, లాల్చీ కళ్లద్దాల బెంగాలీ బాబుగా కనపడ్డాడు జితేంద్రా.

సోకాల్డ్ రోమాన్స్ లేదా పాత్రలో... కాని జితేంద్రని "క్రిటిక్స్" "కమాన్ బాయ్ యూ ఆర్ డూయింగ్ సమ్‌తింగ్" అన్నారు.

"కాని నేను తీసిన "కినారా" చిత్రం చూడండి... అందులో నేను "గుల్‌జార్" యిమేజ్ మార్చేశాను అన్నాడు యిప్పుడు.

ఇక్కడ 'బెంగాలీ' 'హేమ్మామాలిని' క్రిటిక్స్ అన్న మూడు సంగతులు చెప్పాను అంచేత వీటిగురించి కొంచెం.

మా సంభాషణం "అంగ్రేజీ"లో సాగింది... "హిందీలో సాగించమన్నాను. నేను అంగ్రేజీ, మీరు హిందీ... ఓ. కే ? !" అన్నాను కాని జితేంద్రా అక్కరలేదు "ఎందుకుటా ?" అనడిగాడు.

నేను చెప్పాను "యీ ప్రాంతాలలో హిందీ ముక్కలు అంతో యింతో రాని వాళ్లుండరు ... హిందీ బైస్కోపు బొమ్మలు కూడా మా "పత్రిక" అట్టమీద వేస్తూంటాం" అని "ఎందుకంటే అది మన జాతీయ భాషగా" అని కూడా వాక్యాన్ని సాగదీశాను. వెంటనే "ప్ప ... ఏం నేషనల్ లాంగ్వేజి పోనిద్దురు...అది కూడా యిండియన్ లాంగ్వేజెస్‌లో వొకటి" అన్నాడు జితేంద్రా.

జితేంద్రా పంజాబీవాడు. పంజాబీయుల లాగ అంత భారీ విగ్రహం కాదు. నాజూకైన విగ్రహం, ఉషారైన సరళి వున్నవాడు.

"పత్రిక"ని చూశాడు...మధ్య పేజీలు ముఖ చిత్రం కొంచెం అర్థమైనట్లు తిరగేశాడు. "మీ వాళ్లు కొందరు హిందీ తారల బొమ్మలు అట్టమీద పడితే సణుగుతారన్నారు కాని అందులో తప్పేంలేదు ... మిగతా ప్రాంతాల్లో మీ వాళ్ల బొమ్మలు వేస్తే కూడా అంతేగా" అన్నాడు.

నేను చెప్పాను ... దూరంగా "షూటింగ్" బ్రేక్‌లో చుట్టూరా వున్న వాళ్లని ఆట పట్టించాలని అల్లరి చేస్తున్న "రేఖాని" చూస్తూ "అదిగో వైజయంతిమాల, అనక పద్మిని, హేమామాలిని, మధ్యలో మా "వహీదా" – యిప్పుడు రేఖా ... వీళ్లంతా వింధ్యపర్వతాలకు యిటువేపు తారలు .

అక్కడ హిమాలయోంకే "నీచే" రాణిస్తున్నారు సుమా..." అని.

"ఔను ! వాటెవర్ యిాజ్ గుడ్ దే విల్ ఏక్సెప్ట్. జనాలు బాగున్నదాన్ని ఆదరిస్తారు." అని మళ్లీ అదే చెప్పాడు జితేంద్ర.

## "ఫాన్స్' క్లబ్స్" లేవు

టీనేజ్డ్ సోఫిస్టికేటడ్ గాల్స్ — చాలామంది రికమండేషన్‌లతో వచ్చి ఫొటోగ్రాఫర్‌లను బతిమాలి జితేంద్రా ప్రక్కన నిలబడి ఫొటోలు తీయించుకుంటూ తెగ విసిగిస్తున్న దృశ్యాలు చూశా నేను ... యిది మోజా ? క్రేజా ! అనుకుంటూ.

"మీ ప్రాంతంలో అభిమాన సంఘాల వ్యవహారం ఎలాగుంటుంది ? ... మీకు ఎన్ని క్లబ్‌లున్నాయి !" అనడిగాను.

"అలాంటి పదార్థాలు మాకు తెలియవన్నాడు. హీరోయిన్‌లతో చొరవగా చనువుగా నటించడం అలవాటైపోయిన యిా ప్రొడ్యూసర్ హీరో "కినారా" తన రాటోయే చిత్రం — దానిమీద చాలా ఆశలు పెట్టుకున్నాడు జితేంద్రా.

గాస్సిప్ కాలమ్స్‌కి బొంబాయి ప్రెస్ పెట్టింది పేరు—హేమమాలినితో కూడా ఒకప్పుడు వీటిలో విజయం చేసిన క్రెడిట్ వుంది జితేంద్రాకి—కాని ...

పెళ్లైంది...యిద్దరు పాపలు జితేంద్రాకి... 32 సం. లు మొన్ననే వెళ్లాయి యిా హీరోకి.



మేకప్ లేకుండా ఇలా ఉంటాడు
హిందీ సోగ్గాడు

"ఒక 'బాబా', ఒక 'పాప' వున్నారు. వాళ్లలో పెద్ద పాప వయస్సు పద్దెనిమిది మాసాలు, రెండో పాప పుట్టి యింకా రెండు మాసాలే అయింది" అన్నాడు.

జితేంద్రాకి క్రమేపీ వైవిధ్యంగల పాత్రల మీద మనసు తిరుగుతున్నది. "ఫైక్స్డ్ రోల్సు" నుంచి వెరైటీవున్న నిండైన పాత్రల వేపు ధైర్యంగా తిరుగుతున్నాడు.

## మంచి భవిష్యత్ ?

ఇంకా యువకుడు ... పోట్లగిత్త లాంటి పాత్రలను వేయడంలో డ్యూయట్‌లలో డైరక్టర్‌ల "వోకే" కట్‌లు, సెన్సార్‌ల "నాన్ ఓ.కే" కట్‌లు వేయించుకోగల రొమాంటిక్ హీరో.

దిల్ దార్‌లో యితని "గెటప్" బహుశా మున్ముందు చాలా పాపులర్ అవ్వొచ్చును. 'దిల్‌దార్' తరువాత హిందీ సావాసగాళ్లలో కూడా జితేంద్రా హీరో అవుతాడు ! నిర్మాత రామానాయుడు మీద యిా హిందీ హీరోకి అపారమైన గౌరవం వున్నట్లు కనపడుతున్నది.

బెజవాడ పరిసరాలను రంగులలో [మరి ఏ హిందీ ప్రాంతపు గ్రామంగా చూపుతారో తెలీదు గాని] ఆలిండియా వెండి తెరకెక్కిస్తున్న యిా నిర్మాత జితేంద్రా చేత సావాసగాళ్ల వంటి "నాన్ హీరో" కథను తీస్తే అది హీరోకి నిర్మాతకి కూడా వెరైటీ 'యిస్తున్నారన్న' క్రెడిట్‌ని యిస్తుందేమో !

ఈ ప్రాంతంలో వున్న నటుల పాప్యులారిటీ గురించి సందర్భవశాత్తు జితేంద్ర అడిగాడు ... (ఫొటో చూడండి) నేను నాకు తోచింది చెప్పాను ఉదాహరణకి ఆ వారం మన సంచిక అట్టమీద వున్న నటునికి [అక్కినేని] విశ్వవిద్యాలయం కళాప్రపూర్ణ యిచ్చి గౌరవించింది. ఇటుప్రక్క కళాకారుల కలాంటి గౌరవం వుంది అని చెప్పాను

## "చాలా బాగుంది"

'జితేంద్ర' వారం పదిరోజులుగా తెనుగు గడ్డ నడిబొడ్డున వుండి నేర్చుకున్న తెనుగు మాటలు "చాలా బాగుంది" అన్నవే...దిల్ దార్‌లోని పాత్ర, బెజవాడ ప్రాంతం ... , 70 సం.ల నుంచీ (మైగాడ్ ! 70 యియర్స్ ?) వెలువడుతున్న ఆంధ్ర వారపత్రిక యివన్నీ "చాలా బాగుందీ...!" అన్నాడు....అదీ సంగతి. ★ ★ ★

# * సినిమా విశేషాలు *

### ఇద్దరు మంచివాళ్లు

కథానాయకుడు చిత్ర నిర్మాత గోపాలకృష్ణ, చీకటివెలుగులు చిత్ర నిర్మాత రంజిత్ కుమార్ కలిసి ఒక మంచి చిత్రాన్ని నిర్మించడానికి నిర్ణయించారు.

ఇద్దరు కలిసి కొత్త సంస్థను స్థాపించి, "ఆదర్శ చిత్ర" అని పేరు పెట్టారు.

### నటరత్న ద్విపాత్రాభినయం

మా ఇద్దరి కథ వర్ణ చిత్రంలో నటరత్న వైవిధ్యం వున్న ద్విపాత్రాభినయం చెయ్య, ప్రభాకరరెడ్డి, రావుగోపాలరావు, మంజుల, జయప్రద, రాజబాబు, మరియు సత్యనారాయణ వంటి ప్రముఖులు ముఖ్య పాత్రలను పోషిస్తున్నారు.

ఈ భారీ రంగుల చిత్రానికి స్వామి, చక్రవర్తి, గోపి, జనార్దన్ వరుసగా కెమరా, మ్యూజిక్, డైలాగ్స్, ప్రొడక్షన్ను నిర్వహిస్తున్నారు.

### భీంసింగ్ పౌరాణికం

తెలుగువాడై యుండి, తమిళ దేశంలో శివాజీ చిత్రాల దర్శకుడుగా గణుతికెక్కిన ఏ. భీంసింగ్‌గారిని యిామధ్య ఎ. వి. ఎమ్. లో కలిశాను.

రాధా చిత్ర రంగుల్లో నిర్మిస్తున్న "కరుణామయుడు" చిత్రానికి భీంసింగ్ నిర్దేశకుడు. ఆయన దర్శకత్వం నిర్వహిస్తున్న మొదటి పౌరాణికం "కరుణామయుడు" అని ఆయన అంగీకరిస్తూ, ఫాదర్ జార్జి, మోదుకూరి జాన్సన్ తదితరుల ప్రోత్సాహం తనను పురికొల్పినట్లు చెప్పారు.

ఫాదర్ జార్జి మాట్లాడుతూ ఏసుక్రీస్తు ప్రభువు యిచ్చిన సందేశంమీద "కరుణామయుడు" చిత్ర కథ అల్లబడిందని చెప్పారు.

ఏసుక్రీస్తు పాత్రధారి విజయచందర్ ఆ గెటప్‌లో సహజంగా స్ఫురించాడు. మిగతా పాత్రలను మిక్కిలినేని, ధూళిపాళ, పద్మనాభం, గిరిబాబు, వెన్నిరఆడై నిర్మల, మరొక జర్మనీ నటి పోషించ, "కళావాచస్పతి" ముఖ్య భూమికను ధరిస్తున్నారు.

ఈ చిత్రానికి మోదుకూరి జాన్సన్ రచయితగా వుండడం, శుభావహం.

'ప్రేమ లేఖలు'లో జయసుధ, దీప



# డాక్టర్ అక్కినేనితో గడిపిన నిమిషాలు

అక్కినేని నాగేశ్వరరావుగారికి ఆంధ్ర విశ్వవిద్యాలయం "కళాప్రపూర్ణ" బిరుదును యివ్వడం ముదావహం. ఒక స్కాలర్‌కు తెలిసిన అన్ని సంగతులు అక్కినేనిగారికి తెలుసు అన్న సంగతి, ఆయనతో పరిచయం వున్నవారికి తెలుసు.

### అన్నీ తెలిసిన వ్యక్తి

ఈమధ్య ఒక రోజున 'కళాప్రపూర్ణ'ను స్థానిక సవేరా హోటల్‌లో కలిసి, పది నిమిషాలు ఆయనతో గడిపాను. అదేమిటోగాని, ఆయనతో మాట్లాడుతుంటే, ఎన్నో నేర్చుకోవాలని, ఎంతో అడగాలని అనిపిస్తుంది. ఏ విషయం గూర్చి అడిగినా, తడబడకుండా సమాధానం యివ్వగల శక్తి అక్కినేనికి వుంది. అక్కినేనిగారిని నేనడిగిన అయిదు ప్రశ్నలకు ఆయన యిచ్చిన సమాధానం యిలా వుంది :

ప్ర : మీ విజయ రహస్యం చెప్పగలరా ?

జ : ప్రేక్షకుల అభిమానం. నిర్మాతల ప్రోత్సాహం. దర్శకుల ఆశీర్వాదం. "ప్రేక్షకుల అభిమానమే నా పెట్టుబడి. నిర్మాతల ప్రోత్సాహమే నా రాబడి."

### సుందర మందిరం

ప్ర : మీ స్టుడియోను గూర్చి రెండు వాక్యాలు...?

'ఆలుమగలు' లో అక్కినేని

## సినిమా

జ : నేను వూహిస్తున్న 'అందాల మందిరం' రూపం అందుకుంటుంది. ఆసియాలో యిదొక 'సుందరతర ప్రదేశం' అవుతుందన్న నమ్మకం నాకుంది. నా ప్రేక్షకులు, నిర్మాతలు యిస్తున్న ధైర్యానికి ప్రతిరూపమే 'అన్నపూర్ణా స్టుడియో'.

ప్ర : ప్రస్తుతం వస్తున్న చిత్రాలపై మీ అభిప్రాయం ?

జ : ప్రేక్షకులు కోరే అంశాలు ఏ చిత్రానికి వున్నా దానికి విజయం లభిస్తూనేవుంది.

కాస్త వినోదం, రసమయ శృంగారం, కదిలించే కరుణరసం, ఆనందించదగ్గ సంగీతం వున్న చిత్రానికి అపజయం వుండదేమో !

### కలిసి చేస్తాము

ప్ర : మీరు... రామారావుగారు మరల కలిసి నటించే అవకాశం వుందా ?

జ : ఎందుకుండదు. ఇద్దరినీ భరించే నిర్మాత కావాలి. ఇద్దరికీ సరిపడే పాత్రలుండాలి. అలాంటి అవకాశం వస్తే, ఎందుకు చెయ్యము. ఇప్పుడు చేస్తున్నాముగదా !

### తెలుగు చిత్ర ప్రధాన కేంద్రము !

ప్ర : ఆంధ్ర ప్రదేశ్‌లో చిత్ర పరిశ్రమ ఎలా వుంటుంది ?

జ : ఆశాజనకంగా వుంటుంది. త్వరలో తెలుగు చలనచిత్ర ప్రధాన కేంద్రంగా భాగ్యనగరం భాసిల్లడం తథ్యము అనిపిస్తుంది.

తెలుగు చిత్ర నిర్మాతలేగాక, హిందీవాళ్ళు కూడా యిక్కడ చిత్రాలు తీసేందుకు వస్తారన్న ఆశ... నమ్మకం నాకుంది.

మీ స్టుడియోలో యింతవరకు ఫెయిల్యూర్ లేదంటే అని నేను అభినందించాను. అదెలా అని ఆయన ప్రశ్నించారు.

"సెక్రటరీ... మహాత్ముడు... చక్రధారి... జడ్జిగారి కోడలు" ఆబవ్ యావరేజ్ చిత్రాలు "కర్ణ" హిట్ చిత్రం. అందుకని అలా చెప్పాను. ఆయన తనకే సొంతమైన 'నవ్వు'ను అందించారు. ★



'గీత – సంగీత' లో కృష్ణంరాజు, ప్రభ

# 'అంతా దైవానుగ్రహం' —ఎన్.టి.రామారావు



'అడవిరాముడు' లో ఎన్.టి.ఆర్.

"దాన వీర శూర కర్ణ" వర్ణ చిత్రం ఆంధ్ర దేశంలో విజయఢంకా మ్రోగిస్తున్న విషయం అందరికీ తెలుసు. అట్టి విజయ చిత్రాన్ని నిర్మించిన నందమూరి తారకరాముని అభినందించడానికని ఫిబ్రవరి చివరిరోజున బజాల్లా వీధిలోని ఆరవై మూడో యింటికి వెళ్లాను.

నే వెళ్లిన వేళ, వందలాది అభిమాన ప్రేక్షకులు ఎన్టీఆర్‌గారి దివ్యమంగళ విగ్రహాన్ని దర్శించి, ఆయన యిచ్చిన చిరునవ్వుకు సంబర పడడం నా కళ్ళారా చూచి ఆశ్చర్యపోయాను.

ఎన్టీఆర్‌గారంటే, అంత అనురాగం ఎందుకని వచ్చిన ప్రేక్షకులను ప్రశ్నించాను.

## ప్రేక్షకుల అనుభూతి

ఆయనగారిని అలానే గంటలతరబడి చూస్తూ వుండాలనిపిస్తుంది అని ఒక వృద్ధుడు, ఆయన [illegible]శు నవ్వు పున్నమిచంద్రుడివలె వుంటుందని మరొకతను, ఆయన చేతులెత్తి నమస్కరించేప్పుడు, దేవతా స్వరూపం కనిపిస్తుందని యింకొక వ్యక్తి వెలిబుచ్చినప్పుడు అనిపించింది ... ఎన్టీఆర్ కారణ జన్ముడని.

తనను చూడవచ్చిన అయిదారువందలమందిని పలకరించి, కుశలప్రశ్నలతో సత్కరించి, ఎన్టీఆర్ తన ప్రత్యేక గదిలోకి ఎంటర్ అయ్యారు. ఆయన్ను నేనూ వెంబడించాను.

ఒక గంటసేపు వచ్చే పోయే నిర్మాతలతో ఎన్టీఆర్ గడపాల్సి వచ్చింది.

"కంగ్రాచులేషన్స్" అన్నాను. "నాదేముంది. అంతా దైవానుగ్రహం...ప్రజాభిమానం", అన్నారు నటరత్న.

ఒక చిత్రంలో మూడు పాత్రలను పోషించడం ఎంత కష్టమో, పోషించి విజయం సాధించడము అంతకన్న కష్టముగదంటే అని నే నడిగినప్పుడు ఆ మహానటుడు అన్నది ఒక్కటే. "కృషితో నాస్తి దుర్భిక్షమ్."

ఆరోజున అంటే ఫిబ్రవరి యిరవై ఎనిమిదిన "శ్రీరామ పట్టాభిషేకం" సాంగ్ రికార్డింగ్ అని ఆహ్వానించారు.

## సీతాన్వేషణ

ఈ చిత్రంలో రాముడుగా ... రావణుడుగా ఎన్టీఆర్, లక్ష్మణుడుగా బాలకృష్ణ నటిస్తున్నట్లు ఎన్టీఆర్ వెల్లడించారు. సీతాన్వేషణ జరుగుతున్నట్లు కూడా తెలిపారు.

మీరు ఎన్ని చిత్రాలకు ప్రస్తుతం గ్రీన్ సిగ్నల్ యిచ్చారు అని అడిగాను.

"అడవిరాముడు" ఫినిష్ చేశాను. "మార్చి ఒకటి నుంచి మా యిద్దరి కథ, పద్నాలుగు నుంచి అమానుష్, తరువాత సతీసావిత్రి" చిత్రాలకు షెడ్యూల్సు యిచ్చాను, అన్నారాయన.

## సమంజసమా ?

"సావిత్రి" చిత్రంలో సత్యవంతుడు కూడా మీరేనా అని ప్రశ్నించాను. యమధర్మరాజు పాత్రను మాత్రమే పోషిస్తున్నాను. అన్ని చిత్రాలలో రెండేసి పోషించడం సమంజసము కాదన్నారాయన.

చిరంజీవి బాలకృష్ణతో ఏదేని ప్లాన్ చేస్తున్నారా అని అడిగాను. బాలయ్యను సలీమ్‌గా ప్రెజెంట్ చెయ్యదలచాను. అక్బర్ మీరేగా అన్నప్పుడు, ఆయన తలూపారు.

"ముదుమలై" అనుభవాలను వివరించగలరా?

## ఒకే కుటుంబం

"అది అడవి అనిపించనీకుండా, సత్య చిత్ర నిర్మాతలు అన్ని వసతులు సమకూర్చారు, నిర్మాతలు సత్యనారాయణ, సూర్యనారాయణగార్లు సిటీలో లభించే అన్నిటిని అరణ్యంలో యెలా సమకూర్చగలిగారో, ఆశ్చర్యంగా వుందన్నారు. మేమంతా ఒక కుటుంబంలోని సభ్యులవలె కలిసిమెలిసి "ముదుమలై" క్యాంపును ఎంజాయ్ చేశాము. నెలరోజులు నిమిషాల్లాగా గడిపాము. అయామ్ వెరీ హ్యాపీ టు వర్క్ విత్ ది యూనిట్" అన్నారు పద్మశ్రీ రామారావు. ★

'జీవిత నౌక' లో శోభన్ బాబు, జయప్రద



# 18 చిత్రాల నాయకుడు మురళీమోహన్

యువతరం నాయకుడు శ్రీ మురళీమోహన్‌తో "ఉగాది" సందర్భంగా జరిపిన యింటర్‌వ్యూ.

ప్ర : మీరు పరిశ్రమ కొచ్చి సాధించినది ?

జ : ప్రేక్షకుల అభిమానం. నిర్మాతల ప్రోత్సాహం. దర్శకుల ఆశీర్వాదం.

ప్ర : మీరు యింతవారు కాగలరని వూహించారా ?

జ : నేను వూహించినా...వూహించకపోయినా, నేను నటుడుగా స్థిరపడగలనని నమ్మినవాళ్ళు నలుగురున్నారు.

ఒకరు చటర్జీగారు, మరొకరు క్రాంతికుమార్ గారు, ఇంకొకరు "తిరపతి" చిత్ర నిర్మాతగారు, అందరికీ తెలిసిన దాసరి నారాయణరావుగారు.

ప్ర : మిమ్మల్ని దాసరిగారు తమ చిత్రాలలో తప్పనిసరిగా పెడతారు. ఎందుచేత ?

జ : నా భవిష్యత్తును కోరే మంచి వ్యక్తి గనక. నాలో నమ్మకాన్ని పెంచిన గురువు గనక.

ప్ర : ఆర్టిస్టుకు, ప్రేక్షకుడికి వున్న సంబంధం ఎలాంటిది ?



జ : భార్యాభర్తల సంబంధం లాంటిది. ఆర్టిస్టుల జీవితాలు ప్రేక్షకులిచ్చే తీర్పుమీద ఆధారపడి వుంటుంది.

ప్ర : మీకు నచ్చిన హీరోయిన్లు ఎవరు ? ఎవరి కాంబినేషన్ను మీరు లైక్ చేస్తారు ?

జ : నా పక్కన నటించే ప్రతి హీరోయిన్. నాకు ఏ కాంబినేషన్ అయినా అభ్యంతరం వుండదు.

**రెండూ జరుగుతాయి !**

ప్ర : మీరు కథ విని పాత్రను అంగీకరిస్తారా? మొహమాటంకోసం ఒప్పుకుంటారా ?

జ : అన్ని కథలు విని, నచ్చితేనే ఒప్పుకుంటాను. కొన్ని సందర్భాలలో రెండోదికూడా జరుగుతుంది.

ప్ర : మీకు బాగా పేరు తెచ్చిన చిత్రం ఏది?

జ : "భారతంలో ఒక అమ్మాయి, జ్యోతి."

**లేదు ... రాదు !**

ప్ర : మీకు చిత్ర నిర్మాణంపై మోజులేదా?

జ : లేదు. రాదు.

ప్ర : అభిమానసంఘాలు అవసరమంటారా ?

జ : ప్రేమించేవాళ్ళను ఎవరయినా వద్దనగలరా !

ప్ర : మీరు తీరికవేళల్లో ఏం చేస్తారు ?

జ : స్నేహితులతో కబుర్లు. కుటుంబ సభ్యులతో సినిమాలు. (తీరిక దొరికితేగదా !)

**ప్రస్తుతం నటిస్తున్న చిత్రాలు**

"వినయం ... విధేయత ... మంచితనం ... సభ్యత ... విశ్వాసం" వున్న మంచిమనిషిగా మురళీ

సాగర చిత్ర

# స్నేహం

ఆర్వోకలర్

దర్శకుడు బాపు
నిర్మాత C.H సీతారామరాజు
మాటలు ఎమ్వీయల్
కెమెరా ఇషాన్ ఆర్య
సంగీతం K.V. మహదేవన్
కూర్పు మందపాటి రామచంద్రయ్య





సృష్టిలో
తీయనిది
స్నేహమేనోయీ!

VIJAYA

విజయా రిలీజ్
Nandi



నెల్లూరులో జరిగిన 'నెప్త్యా' నాటక కళా పరిషత్తు బహుమతి ప్రదానోత్సవంలో పాల్గొన్న నటి జయచిత్రను సన్మానిస్తున్న సంస్థ అధ్యక్షుడు శ్రీ మందరరామిరెడ్డి

## ...మురళీమోహన్

మోహన్‌కు పరిశ్రమంతటా పేరుంది. తను, తన పాత్ర, తన భవిష్యత్తు తప్ప అనవసర ప్రసంగాలు గాని, మరొకరి ప్రసక్తిగాని మురళీమోహన్‌కు గిట్టని విషయాలు.

ప్రస్తుతం మురళీమోహన్ నటిస్తున్న చిత్రాలు :

ప్రేమించి పెళ్లి చేసుకో, ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ వారి అర్ధాంగి, అన్నపూర్ణా పిక్చర్స్ వారి ప్రేమలేఖలు, లక్ష్మి జ్యోతి ఫిలింస్ వారి పిల్లరకొట్టు చిట్టెమ్మ, బంగారక్క, కల్పన, ఓ మనిషీ తిరిగి చూడు, తొలిరేయి గడిచింది, ఇదెక్కడి న్యాయం, భద్రకాళి, తల్లే చల్లని దైవము, గడుసు అమ్మాయి, గంగ...యమున... సరస్వతి, ఖయిదీ నెం 77, క్రాంతి చిత్ర, శ్రీ శ్యామ్‌ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్, శ్రీ అన్నపూర్ణా సినీ ఎంటర్‌ప్రైజస్. ★

# "ఏడాదికి ఐదు చాలు": ప్రభ



"సంవత్సరానికి మంచి చిత్రాలు అయిదు చేస్తే చాలు" అని సైకొస్తున్న ప్రభ తీసుకున్న నిర్ణయం ఎంతో సమంజసము అనిపించింది. ఇలాంటి నిర్ణయం తీసుకోవడానికి బలవత్తరమైన కారణం ఏమైనా వుందా అని ప్రశ్నించాను.

వుంది అంటూ ఆమెకొచ్చే వుత్తరాలను చూపించింది. ప్రభను అభిమానించే వాళ్లందరూ సెకండ్ గ్రేడ్ పాత్రలకు స్వస్తి చెప్పమని, మంచి పాత్రలను మాత్రమే చెయ్యమని, సూచిస్తున్నారు.

### పాప వ్రాసిన దేమిటి ?

ఒక పదేండ్ల పాప వ్రాసిన వుత్తరాన్ని చదివి వినిపించింది. ఆ అమ్మాయి వ్రాసిన ప్రతి అక్షరం ఆమోదయోగ్యమని చదివిన ఎవరయినా అంగీకరిస్తారు, ఎక్కువమంది వ్రాసే వుత్తరాలలో కామన్‌గా కనిపించేది ఒకటుంది. మీరు... శోభన్ బాబుగారితో ఎప్పుడు నటిస్తారు.

ఈ ప్రశ్నకు సమాధానం ఏమిటని అడిగాము. "ఆయనగారి ప్రక్కన నటించాలని నాకూ వుంది. ఇంకా కలిసిరావడంలేదు", అంది ప్రభ.

### మరపురాని విషయం

"అత్తవారిల్లు" చిత్రం షూటింగు గుంటూరులో జరిగినప్పుడు, ఒక విచిత్ర సంఘటన జరిగింది. "ఆ సంఘటన నే నెన్నటికీ మరువలేను" అంది ప్రభ.

అంత మరపురాని విషయాన్ని పాఠకులకు తెలపగలరా అన్నాను. అంతకంటేనా అంది.

రోజూ షూటింగు చూడడానికని ఒక యిరవై ఏండ్ల యువతి వచ్చేది. ప్రతి నిమిషం నావంకే చూసేది. నేను ఎక్కడుంటే, అక్కడకు పరిగిడుతూ వచ్చేది. రెండు రోజులు అలాగే సాగింది. మూడో రోజున నన్ను సమీపించింది. "అక్కయ్యా" అంటూ కన్నీరు కార్చింది. నన్ను చూచి భోరున ఏడ్చింది.

"ఏమిటమ్మా...నీకేమైంది" అని ఓదార్చాను. ఎంత అడిగినా, ఏమీ చెప్పింది కాదు. చివరకు రెండు ముక్కలు అనగలిగింది.

### అక్కయ్య లాంటి ప్రభ

నీలాంటి అక్కయ్య నాకు వుండేది. మా అక్కయ్యే దిగివచ్చిందేమోనని, నిన్నలా చూస్తూ వున్నాము. నీకు బొట్టు పెట్టనా. నీకు గాజులు తొడగనా" అని అంటూ నా పాదాలకు నమస్కరించింది. ఆమె కన్నీటి బిందువులు నా హృదయాన్ని కదిలించింది. ఆ ఘట్టాన్ని రోజుకొకసారయినా నెమరువేసుకుంటాను" అంది ప్రభ.

"ఈమధ్య ఆ అమ్మాయి దగ్గర్నుంచి ఒక కవరు వచ్చింది. అందులో రెండు గాజు గ్లాసులు... ఒక కుంకుమబరిణె వున్నాయి. నా కళ్లు ఆనందంతో చెమ్మగిల్లాయి" అంది ప్రభ.

### ప్రేక్షకుల కోరిక !

కొత్త సంవత్సరంలో విడుదలయిన మీ చిత్రాల పట్ల ప్రేక్షకుల రిసెప్షన్ ఎలా వుంది అని ప్రశ్నించాను.

"సంసారంలో సరిగమలు చిత్రంలో గ్లామరస్‌గా వున్నానని, అత్తవారిల్లు చిత్రంలో మురిపెంగా వున్నానని, కర్ణ చిత్రంలో అందంగా అగుపించానని వుత్తరాలు వ్రాస్తున్నారు. ఇకపై సెకండ్ హీరోయిన్‌గావద్దని వ్రాస్తున్నారు. ఏప్రిల్‌నుంచిచాలా బాగుంటావు అని జోస్యం చెపుతున్నారు" అంది ప్రభ.

"ఇదెక్కడి న్యాయం చిత్రంపట్ల, ఆ చిత్రంలో నా నటనపట్ల ప్రేక్షకులు ఎక్కువ ఆశ పెంచుకున్నారండీ" అంటూ ఆమె దగ్గరున్న వంద వుత్తరాలను నాకు చూపించింది.

ప్రస్తుతం నేను నటిస్తున్న "జీవితంలో వసంతం, గీత... సంగీత" చిత్రాలను ప్రేక్షకులు ఆదరించగలరని నమ్మకం తనకున్నట్లు ప్రభ చెప్పింది.

— శ్రీనివాస్ ●





# వెనకటి రోజులు...

పాలకోడేటి సత్యన్నారాయణ రావు




మా కాలనీలో ఇళ్లన్నీ దగ్గర దగ్గరే వున్నాయన్న సంగతి నాకు తెలుసుకానీ మరీ ఇంత దగ్గర అని మాత్రం తెలీదు – ఆ సంగతి ఆ అంటువ్యాధి మా యింటిలోకి వచ్చేసరికి తెలిసింది.

ఎన్నాళ్ళనుంచి అనుకొంటూవుందోగానీ, ఆ ఆదివారంనాడు మధ్యాహ్నం, కొంచెం విశ్రాంతి తీసుకొందామా అనుకొంటున్న సమయంలో, రేడియో కట్టేసి, ఫ్యాన్ ఆన్‌చేసి, నెమ్మదిగా మంచం దగ్గరకు చేరింది శోభ. శ్రీమతి దగ్గరగా చేరగానే ఏదో ఒకటి కోరడానికే వచ్చింది అని అనుకోవటం మర్యాద కాదుగదా! అయినా కీడెంచటం మేలనే నియమంవున్న మనిషిని కాబట్టి, అటుపక్కకు తిరిగాను.

పక్కనే కూర్చుని నెమ్మదిగా అంది శోభ "మీరేమీ అనుకోనంటే, ఒకటి చెబుతాను."

శోభకేసి తిరిగాను – "చెప్పు."

"ఏమీ అనుకోరుగా ?" మళ్ళీ అడిగింది.

ప్రమాదాన్ని శంకించినా అన్నాను – "ఏమీ అనుకోనులే, చెప్పు."

క్షణం ఆగి అంది శోభ – "మనం వ్యాపారం చేద్దామండీ !"

ఉలికిపడ్డాను – ఏమంది శోభ? వ్యాపారమా ? ఏం వ్యాపారం ? అయినా మా వంశంలో అటు యిటూ ఎన్నితరాల చరిత్ర తిరగేసి చదివినా, వ్యాపారవేత్త ఒకడూ వుండివుండడు. శోభకు ఎందుకు వచ్చింది యీ అయిడియా ?

అయినా పెట్టుబడో ?

ప్రశ్నలన్నీ నావి. "వ్యాపారం? ఏం వ్యాపారం? యెందుకు వ్యాపారం? యెలా చేయాలి? ..." ఇత్యాదులన్నీ అడిగాను.

శోభ వీటన్నిటి గురించీ ముందే ఆలోచించింది కాబోలు, నా ప్రశ్నలన్నీ సిల్లీగా తోచి, అవన్నీ పక్కకు కొట్టేస్తున్నట్లుగా అంది – "ముందు ఊ అనండి. మిగతా అన్నిటికీ నేను దారి చూపిస్తాను,"

ఎంత గొప్ప అభయప్రదానం !

కానీ, శోభకు యింత తెలివితేటలు ఎక్కడివి? వాళ్ళ యింట్లో ఏ ఒక్కరూ పనికివచ్చినవాళ్ళల్లో లేరన్నది నాకుమాత్రం తెలిసిన నిజం.

"ముందు నీ సంగతి చెప్పు." అన్నాను నేను మళ్ళీ.

అయినా శోభ దగ్గర నేనే ఓడిపోయాను – మొత్తానికి సరే అనిపించింది నాచేత. బహుశా వ్యాపారం చేయటంవల్ల లక్షాధికారిని కాకపోయినా, బాగా డబ్బు సంపాదించగలమనే ఊహ నాలోనూ ఉందేమో, అందుకే ఊ అన్నట్టున్నానా ?

శోభ నోరు విప్పింది విని ఉలికిపడ్డాను. భార్యకు అన్ని విషయాలు చెప్పుకోవటంలో ఎంత ఆనందం వుందో అనే అనుకున్నానుగానీ, అదెంత తెలివితక్కువ పనో తెలీలేదు నాకు ! "మీ ఆఫీసులో సొసైటీవాళ్ళు మీకు అయిదువేలు అప్పు యిస్తారు గదా !" అంది శోభ.

"ఊరికేకాదు, నెలనెలా వడ్డీ కట్టాలి, తెలుసా ?"

"ఫర్వాలేదు, కట్టేద్దాం !"

"అంటే, అంత లాభం ఉండే వ్యాపారమా మనది ?"

"చెప్తా, ఆగండి. ముందు మీ ఆఫీసులో లోన్‌కు అప్లై చేయండి. ఆ తర్వాత సంగతి తర్వాత..."

"శోభా, ఒక ప్రశ్న – మనం అయిదువేలతో ఏం చేస్తాం వ్యాపారం? ఇంటద్దె కట్టాలి, వడ్డీ కట్టాలి, మన కష్టం..."

"మీకు మీ ఆఫీసువాళ్ళు గాబట్టి ఉద్యోగం యిచ్చారుకానీ, బొత్తిగా బుర్రే లేదండీ మీకు – యెలా నెగ్గుకొస్తున్నారో ఏమో వాళ్ళు !" అంటూ మా ఆఫీసువాళ్ళమీద బోలెడంత సానుభూతి చూపిస్తూ అంది – "మనం ఇంటద్దె అంటూ కట్టనక్కర్లేదు. ఎందుకంటే వ్యాపారం జరగబోయేది మన యింట్లోనే ! పోతే మన కష్టం అంటే, పెద్ద కష్టం అంటూ ఉండదు. ఉన్నా లాభం వుంటుందికదా !"

"మనం చేసేది యింతకూ ఏం వ్యాపార

మంటావ ?'' బితుకు బితుకుగానే అడిగాను — శోభ ఆ వ్యాపారరహస్యం చెబుతుందో చెప్పదో ననుకుంటూనే.

"అదే ఇంకా తట్టలేదండీ! అయినా ఫర్వాలేదు, ఆలోచిస్తూ వుండండి!..." అంటూ శోభ ఆలోచన పైకే చేయడం మొదలుపెట్టింది. "చీరలు, అవీ లాభంలేదు, వాటిల్లో మనం మాధవి వాళ్లను యీరోజు దాటలేం. పోతే దుప్పట్లూ వగైరా కూడా లాభంలేదు, అవి కృష్ణవేణి వాళ్ళు చేస్తూనేవున్నారు. ఫర్నిచర్ వగైరా ఆ వడ్రంగివాళ్ళు, అదేనండీ, ఆ మూల వుండే మీ కుమార్‌వాళ్ళు చేస్తూనేవున్నారు..."

నాకు కొంచెం జ్ఞానోదయం అయింది — శోభ చెబుతున్న మాధవి, కృష్ణవేణి — వీళ్లంతా శోభకు మంచి ఫ్రెండ్స్. మా కాలనీలో ఎవర్ని వాళ్ల గురించి అడిగినా చెబుతారు. మొగుళ్లను యింట్లో పెట్టి తాళంవేసి, ప్రపంచాన్ని అమ్మకు రాగలిగినవాళ్ళు వాళ్ళు. శోభ అన్నట్లు వాళ్లను జయించటం కష్టం.

అంటే, శోభకు యీ విషయంలో ఇన్స్పిరేషన్ వాళ్లన్నమాట!!

"శోభా!" అంటూ శోభను ఆలోచనల్లోంచి నేలమీదకు దింపి ఓ ప్రశ్న వేశాను — "వాళ్ళకు అది అలవాటయిపోయింది. నువ్వు అలా చేయలేవనే నా నమ్మకం!"

శోభ నవ్వింది — "మీరలానే అనుకొంటారు, కానీ వాళ్ళుకూడా పుట్టినప్పట్నించీ వ్యాపారులు కారు గదా! మీకెందుకు, మీరూరుకోండి, అన్ని విషయాలు నేను చూసుకొంటాను."

ఏం చేస్తానుమరి? ఊఁ అన్నాక తప్పదుగదా! అయినా శోభ తల్చుకొంటే చెయ్యగలదనే నమ్మకం నాకు వుండనే వుంది.

"ఊఁ — మనం స్టైయిన్‌లెస్‌స్టీల్ సామాన్ల వ్యాపారం చేద్దామండీ!" అన్న శోభ, మరునాడు ఆ వ్యాపారానికి కావాల్సిన బేసిక్ ఇన్ఫర్మేషన్ అంతా తీసుకొచ్చింది. నేను తెచ్చే ఆ అయిదువేలూ ఓ పెద్ద స్టీలు షాపులో డిపాజిట్‌లో పెట్టి, సామాను తెచ్చి, ఇన్‌స్టాల్మెంటులలో అమ్మి అది షాపులో కట్టి, మళ్లీ సామాన్లు తెచ్చి...ఇదీ సంగతి!

"శోభా, మరి డబ్బు వసూలు సంగతి?..."

"మీరు మరీ భయస్థులండీ బాబూ! మనం కొన్నవాటికి మనం సరిగ్గా తీర్చటంలేదూ? అలాగే అందరూనూ! ఒకరిద్దరు ఓ నెలలో మానేసిన ఫర్వాలేదు, పై నెలలో వసూలు చేసుకోవచ్చు. పైపెచ్చు ఇలాటివి అన్ని వ్యాపారాల్లోనూ వుంటాయి, మీకు తెలీదుగానీ!" ఒకేదెబ్బతో నా ఎం. కాం. డిగ్రీ దమ్మిడీకి పనికి రాకుండా పోయింది!

శోభ కోరుకొన్నట్లుగానే కాక, నా అంతరాంతరాల్లో వుండే డబ్బు సంపాదించాలనే కోరికవల్ల కాబోలు, నేను లోన్‌కోసం అప్లయి చేయటం, డబ్బు తీసుకొని, అదంతా శోభ చేతిలో పొయ్యటం జరిగింది — "శోభా — అయిదు వేలు, జాగ్రత్త సుమా! వ్యాపారం అంటే అంత తేలిక అనుకోకు!"

ఓ చిరునవ్వుతో నా హెచ్చరికను తోసిరాజంది.

రెండురోజుల తర్వాత ఆఫీసునుంచి యింటికి తిరిగివచ్చేసరికి, శోభ ఇల్లంతా ఆకారం మార్చేసింది. మొట్టమొదట, గదిలో వుండే నా రీడింగ్ టేబిల్, బెడ్ రూంలో ఓ పక్కకు వెళ్లిపోయింది. ఇంతక్రితం వుండే ఒకే ఒక్క ఫ్రేము కుర్చీకి బదులుగా ఇప్పుడు ఆ గదిలో రెండు గార్డెన్ మడతకుర్చీలు, ఓ తివాసీలాంటి జంబుఖానా, ఓ పక్కన ఓ చెక్క అలమారు ... ఓ, యిల్లంతా అట్టహాసంగా వుంది.

"శోభా — ఇల్లంతా బాగా మార్చేసావే!" అన్నాను నేను.

శోభ ముఖం మరింత వెడల్పయింది. ఆమె కళ్లు మరింత విశాలం అయ్యాయి. మనసులోంచి పొంగి వచ్చేస్తున్న సంతోషాన్ని ప్రకటించకుండా వుండటానికి విశ్వప్రయత్నంచేస్తూ అంది — "చూస్తూ వుండండి. మన యిల్లు యింకా మారకపోతే నా పేరు శోభే కాదు!"

"అంతా వ్యాపారంవల్లనే?"

అవునన్నట్లుగా గర్వంగా తల ఊపింది శోభ. శోభకున్న ఆత్మవిశ్వాసం నాకెంతో ఆత్మబలాన్ని చేకూర్చిపెట్టింది. అలమారు తలుపుతీసి, తళతళ మెరుస్తున్న స్టీలు గిన్నెలను చూపిస్తూ అంది — "ఇవిగో యివి తెచ్చాను మొట్టమొదట వీటి అమ్మకాన్నిబట్టి, డిమాండునుబట్టి మళ్లీ కొత్త కొత్త వస్తువులు తెచ్చుకోవచ్చు. ఇదిగో, ఈ గిన్నె చూశారా, యిది షాపులో కొంటే యాభై యెనిమిది మనం ఇన్‌స్టాల్మెంటులలో యిస్తే అరవైకి యివ్వచ్చు మూడు ఇరవైలు అరవై. అందులో

పది మనకూ, యాభై షాపువాడికీ !..."

శోభ వివరంగా చెబుతున్నది వింటొంటే నాకు మతి పోతోంది. శోభకు యింత తెలివి ఎక్కడిదబ్బా ?

శోభ కేవలం మాటకారే కాక కార్యవాదికూడా అన్న సంగతి ఇంకో మూడు నాలుగు రోజులకే తెలిసిపోయింది నాకు. ఆఫీసునుంచి యింటికి

# వెనకటి రోజులు

వచ్చేసరికి ముందు గదినిండా ఆడవాళ్లు - వాళ్ల సైజులకు తగ్గట్లుగా గరిటెలు, కంచాలు, చెంబులు, గిన్నెలు ముందువేసుకుని కూర్చున్నారు. శోభ వనితనంమీద నాకు అభిమానం పెరిగి, ఓ నెలలో ఎపుడో కొంచెం బోనస్ ఇద్దామను



కున్నాను. అయినా కష్టమంతా శోభదేగదా !

వాళ్ళందర్నీ పంపేశాక, గదిలోకి వస్తూ అంది శోభ – "చెబితే నమ్మారుగాదు, విన్నారుగాదు. ఈ వేళకు అపుడే వెయ్యిరూపాయలపైగా అమ్మేశాను... ఈ వ్యాపారం మనం ఇంకొంచెంకాలం ముందే మొదలుపెడితే బాగుండేది – పోనీండి, యిప్పటికన్నా నిద్రలేచాం !" 'లేచాం' అని గౌరవంకొద్దీ అంటోందేకానీ, లేచింది తానొక్కతే అన్న సంగతి శోభకు బాగా తెలుసు.

నెల గడిచిపోయింది. మొదటి రోజున జీతం అందుకొంటున్నానన్న మాటేగానీ నాకు ధ్యాసంతా శోభ ఆర్జించబోయే లాభంమీదే వుంది. ఇంటికి వచ్చి, మామూలు అలవాటు ప్రకారం నెల జీతంలో ఆరొందలు శోభకు యింటి యాజమాన్యంకొరకు యిచ్చేశాను. నోట్లన్నీ భద్రంగా అందుకొని వెళ్లింది శోభ.

ఏ విశేషం లేకనే ఆ రాత్రి గడిచిపోయింది.

మర్నాడూ అంతే !

మూడో రోజు రాత్రి యింక ఉండబట్టలేక పోయాను. ఇంటి పని అంతా పూర్తిచేసుకొని, గదిలోకి వచ్చిన శోభను ముందుగా ఆ ప్రశ్న వేశాను. – "శోభా, మన వ్యాపారం సంగతే చెప్పావు కావు ! కలెక్షన్స్ ఎంతయ్యాయి ? –"

నాలిక కొరుక్కొంటూ అంది శోభ – "అరె, చెబుదామనుకొంటూనే మర్చిపోయానండీ – కలెక్షన్స్ ఇవిగో !" అంటూ లేచి, హేండ్‌బాగ్‌లో పెట్టి నోట్లు తెచ్చింది ఖచ్చితంగా ఎనిమిది పది రూపాయల నోట్లు !

ఆశ్చర్యపోయాను – "శోభా ! యిదేమిటె, ఎనభైయే వున్నాయి ?"

"అవునండీ – ఎనభైయే వున్నాయి."

"అదేం ?"

"అదేం అంటారేం ? – మాధవివాళ్లకు మనం ముప్పైరెండు యివ్వాలి. వాళ్లు మనకు ముప్పై యివ్వాలి. ఆవిడ యిచ్చినవి రెండు ! కృష్ణవేణి వాళ్లకు మనం, మనకు వాళ్లు నలభై రూపాయలు యివ్వాలి – కనుక చెల్లు !! ఇంట్లోకి వుంటుందనుకొన్న తివాసీ, అదే మీ జంబుఖానాకు మొదటి ఇన్‌స్టాల్‌మెంట్ పది యిచ్చాను. కొన్న కుర్చీలకు ముప్పై యిచ్చాను. అలమారు, కుమార్ వాళ్ల దగ్గర్నుంచి తెచ్చాంగదా – వాళ్లు తీసుకెళ్లిన సామాన్లకు, మన అలమారుకు చెల్లు వేసేసా..." శోభ యింకా చెబుతూనే వుంది.

నాకు స్పృహ తప్పేనంత పని అయింది. ఏమిటిదంతా ? – వ్యాపారం అంటూ శోభ, వెనకటి మారకపు రోజులను నాకు గుర్తుకు తెస్తోంది. ఇలా అయితే... ఇంకా వ్యాపారం ఏమిటి ?

అదే అడిగాను శోభను.

"శోభా – అంటే, మనం ఈ నెలలో వెయ్యి రూపాయల సామాన్లు యింట్లోకి కొనుక్కున్నామన్న మాట !"

శోభ క్షణం ఆలోచించి, చిన్నగా నవ్వి, అంది– "ఇల్లన్న తర్వాత సామాన్లు కొనుక్కోవాలి. వ్యాపారం అన్న తర్వాత ఇలాటివీ ఎదుర్కోవాలి !"

అంటే ...? రాబోయే రోజులను తలుచుకొని నా మనసు మరొక్కసారి వణికింది.

# ప్రపంచము యొక్క ప్రప్రథమ డెటర్జెంట్ ఉతికే బార్

# సూపర్ 777

హెచ్చు తెల్లదనము, తక్కువ ఖర్చులో






సూపర్ 777 ఉతుకు ప్రపంచములో సరిక్రొత్తది! ఇది క్రొత్త ఫార్ములా. దీనికి ఎక్కువ బట్టలను ఎక్కువ తెల్లగా, ఎక్కువ శుభ్రముగా ఉతికే సామర్థ్యము ఉన్నది—ఉప్పు నీళ్లలో కూడ! దీని ధర మామూలు బార్ సబ్బుల కంటె తక్కువ కూడ!

ఒక క్రొత్త రకపు ఉతికే బార్‌కు స్వాగతము ప్రారంభించండి—సూపర్ 777 డిటర్జెంట్ ఉతికే బార్!

shilpi hpma 6A/73 TEL

## 25-3-1977 శుక్రవారం మొదలు
## 31-3-1977 గురువారం వరకు

# వారఫలం

మహేష్

**మేషం :—** ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. ప్రయాణాలు ఫలిస్తాయి. వృత్తిలో పోటీవారి పోటీ తగ్గుతుంది. వారం ఆఖరులో అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగాఉంటుంది. స్త్రీలకు కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. దైవకార్యాలు నెరవేరతాయి.

**వృషభం :—** వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. పోటీవారితో గౌరవం లభిస్తుంది. ప్రయోజనకరమైన పరిచయాలు ఏర్పడతాయి. మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. సంతోషకరమైన వార్తలనువింటారు

**మిధునం :—** సాహసికవ్యవహారాల్లో నష్టంవస్తుంది ప్రయాణాల్లో శ్రమకలుగుతుంది. వారం మధ్యలో నూతన వ్యవహారాలు లాభిస్తాయి. మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. బంధువులకు చికాకులు ఏర్పడతాయి.

**కర్కాటకం :—** వృత్తిలో ఆదాయంపెరుగుతుంది. మిత్రుల సహాయం లభిస్తుంది. వారం మధ్యలో మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. అధిక వ్యయం జరుగుతుంది. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు తిరిగి బాగుంటాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**సింహం :—** అన్ని వ్యవహారాల్లోను గౌరవం బాగుంటుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది. నూతన వ్యవహారాలు బాగుంటాయి వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. వారం ఆఖరులో ఫలితంలేని శ్రమ కలుగుతుంది. స్త్రీలకు— బంధువులకు సహాయం చేస్తారు. వ్యతిరేకమైన వార్తలను వింటారు.

**కన్య :—** మీ కార్యక్రమాలు బాగుంటాయి. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. వారం ఆఖరులో సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. స్త్రీలకు—వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

**తుల :—** లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. విద్యావైజ్ఞానికరంగాల్లో ఖ్యాతిలభిస్తుంది. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో శ్రమకలుగుతుంది. పోటీవారితో గౌరవం లభిస్తుంది.

**వృశ్చికం :—** మీ ప్రయత్నాలుఫలిస్తాయి. రావలసిన డబ్బు అందుతుంది. వారం మధ్యలో ప్రయాస కలుగుతూంది. సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు. వారం ఆఖరులో ప్రయాణాలు అనుకూలంగా ఉంటాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు బంధుమిత్రులను కలుసుకొంటారు.

**ధనుస్సు :—** వృత్తిలో పోటీవారి పోటీ పెరుగుతుంది. రాజకీయ వ్యవహారాల్లో శ్రమకలుగుతుంది ప్రయాణాలు ఫలిస్తాయి. వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. వారం ఆఖరులో చికాకులకు గురికాగలరు. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

**మకరం :—** వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి రావలసిన డబ్బు అందుతుంది. అనవసరమైన సందేహాలు కలుగుతాయి. ఇతరుల నిమిత్తం శ్రమకు గురికాగలరు. వారం ఆఖరులో మీ ఆలోచనలు ఫలిస్తాయి. స్త్రీలకు ఆరోగ్యం బాగుంటుంది. పోటీవారితో వాదప్రతివాదాలుతగ్గు

**కుంభం :—** మీ కార్యక్రమాలు హడావుడిగా ఉంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. నూతన వ్యవహారాలు బాగుంటాయి. సాహసికవ్యవహారాలు లభిస్తాయి. వారం ఆఖరులో మీ అంచనాలు తారుమారుకాగలవు. స్త్రీలకు- దైవకార్యాలు నెరవేరతాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మీనం :—** వృత్తిలో పోటీవారి పోటీ తగ్గుతుంది. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. బంధుమిత్రులను కలుసుకొంటారు. విద్యావైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణిస్తుంది. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

## రాలిన ముత్యాలు

..శ్రీ సోమసుందర్

దుఃఖకేశాల సమస్త భారమ్మూ
బౌద్ధస్తూపాల మహత్తుతో నశించిందా?
ఈశ్వర పుత్రుడైన జీసస్ అవతరణతో
ప్రేమైక మానవరాజ్యం అవతరించిందా?

## ఫా లా కు ని డై రీ

### 10 నెలల్లో 53 కోట్లు నష్టం!

1975 ఏప్రియల్ నెల నుంచి 1976 జనవరి వరకూ ఉన్న పది నెలలలో మన దేశంలోని నేషనల్ టెక్స్‌టైల్ కార్పొరేషనుకు (బట్టలు తయారీ దేశీయ సంస్థ) 53 కోట్ల రూపాయలు నష్టం వచ్చిందట. అయ్యా అనకూడదు గానీ....

### విషాదాంతమైన సినీనటి వివాహం!

18 ఏళ్ళ నిర్మల అనే మళయాళ నటికి ఆమె నటనను మెచ్చుకుంటూ వచ్చే ఉత్తరాలలో గురువాయూరుకు చెందిన 'శశిధరన్' అనే అతని ఉత్తరాలు నచ్చేవట. ఆమె వాటికి క్రమంగా సమాధానం యిచ్చేదట రానురానూ అవి ప్రేమగా రూపొంది, పెంపొంది స్థిరపడి వివాహ రూపం దాల్చిందట. పెళ్ళయ్యాక శశిధరన్ ఆమెను తిట్టడం, అప్పైన కొట్టడం ఆరంభించాడు. జీవితం అనుకున్నదానికి తారుమారైనదని ఆమె తన అక్కగారికీ విషయాలన్నీ ఓ ఉత్తరంలో వ్రాస్తే ఆమె తండ్రి ఆ అమ్మాయిని పుట్టింటికి పంపాలి అని శశిధరన్‌కు రాశాడట. కానీ ఆ ఉత్తరం వెళ్ళిన వారానికి మీ అమ్మాయి చనిపోయిందని ఆయనకో తంతి వచ్చిందట దాంతో ఆమె తండ్రి తన కూతురు మరణం అసహజమైనదనీ అది హత్యేనని పోలీసులకు ఫిర్యాదు చేశాడట.

### ఘాతుకానికి కారణం . !

[illegible]కు చెందిన 40 ఏళ్ళ మాణిక్యం ఏ ఉద్యోగమూ, వృత్తి లేకుండా తన భార్య తమలపాకులమ్మి తెచ్చే డబ్బుతో రాజా కాలక్షేపం చేసేవాడట. ఒకనాటి రాత్రి ఉన్నట్టుండి మాణిక్యం లేచి, కొడవలితో తన కొడుకు 12 ఏళ్ళ కరుణాకరన్ని తల నరికి చంపేసి, మేనల్లుడు 10 ఏళ్ళ చింతన్ని కూడా కొడవలితో నరికాడు. అతను అనుకున్న పని సరిగా చెయ్యకపోవడంవల్ల ఆ చింతన్ బాబోయ్ నాయనోయ్ అని కేకలేసేసరికి కొడవలి పారేసి, పారిపోయాడట. ఆ సమయంలో మాణిక్యం భార్య ఇంట్లో లేదట. తమలపాకుల వ్యాపారం చేసుకుంటూ రాత్రి కూడా ఆమె రాదట. వచ్చినా అర్ధరాత్రో అపరాత్రో వస్తుందట. ఇంతకూ మాణిక్యం యీ ఘాతుకానికి కారణం.... అదే అయ్యుంటుందా!

### కారుకు నిప్పంటుకుని నటికి గాయాలు!

అలనాడు తెలుగులో అనేక సినిమాలలో నటించిన జెబి పద్మిని తమిళ సినిమాలలో [illegible] హీరోయిన్ వేషాలు వేస్తున్నది. తమిళ నటుడు కమలహాసన్‌తో 'పదహారేళ్ళ వయసులో' అనే సినిమాలో నటిస్తూ కర్ణాటక రాష్ట్రంలోని [illegible] అనే చోట నటించేందుకు శివసముద్రం నుంచి తన తల్లితో కారులో వెళ్తుండగా ఆ కారుకున్నట్టుండి భగ్గున నిప్పంటుకుందట. కారు డ్రయివు చేస్తున్న నిర్మాత ఎస్. ఏ. రాజకణ్ణు గమ్మున కారాపి తాను దిగి పద్మినిని, ఆమె తల్లినీ కూడా క్రిందికి లాగేశారట అయితే నటి పద్మినికి, ఆమె తల్లికి కాస్త గాయాలయ్యాయి. ఆనక..... తెలీదు

# ప్రశ్నావళి

## కె. రామలక్ష్మి

ఎ టి జి ఎస్ చిత్తూరు

మా వీధిలో వున్న ఒకమ్మాయి వీలు చిక్కినప్పుడల్లా ఇంటి గుమ్మంవద్ద నిలబడి వీధ బయటికి వచ్చే వన్నీ చూస్తూంటుంది.

అని మీ ఊహ. నేనైతే ఏ పోస్టు వారికోసమో, బయటి కెళ్లిన వాళ్ల నాన్నకోసమో అన్నకోసమో చూస్తూందనుకుంటాను. నిజానికి ఏపీ చేయని ఆడవాళ్ళు కాలక్షేపానికి గుమ్మాల్లోనే నిలబడి వచ్చేపోయేవాళ్లని చూస్తూంటారు. మీరుట్టినే సిగ్గుపడిపోయి కాళ్ళూచేతులూ ముడేసుకోకండి.

విశాఖ బరంపురం.

ప్రేమలో వుంది మధురం అని కవులు అంటారే మరి ప్రేమ గుడ్డిది అని కూడాఅంటారు ఎందుకు?

తావలచినది రంభ అనుకునే ప్రేమ పిచ్చివాడికి ప్రేమ గుడ్డిదన్నా ఒకటే, ప్రేమ మధురం అన్నా ఒకటే.

పి.వి ఆర్; పి ఎ.ఎల్; పి.కె. ఓ.నే కొండపల్లి

రచయిత్రుల సభలో హేమలతగారు విన్నారా రామలక్ష్మీ అనీ, రావయ్యా అనీ అన్నారే అప్పుడు మీకు చాలా కోపం వచ్చిందని అనుకున్నాము....

ఆత్మీయులు ఎలా పిలిచినా నాకు కోపం రాదు. నేను వస్తుంటే ఎప్పుడూ మాలతి అంటూంటుంది మా ఏనుగు వస్తూంది కాస్త తప్పుకోండని ! నిజమైన అభిమానం వున్నప్పుడే కల్మషంలేని వేళాకోళం రాణిస్తుంది.

కె. జె. జి. సదాశివపేట.

ఏమండీ, విద్యావంతులైన పురుషులు విద్యలేని స్త్రీని వివాహం చేసుకుంటున్నారు కదా? ఆ విధంగా స్త్రీలు ఎందుకు చేయడం లేదు?

ఎందుక చేయడం లేదండీ. గ్రాడ్యుయేటు రైతు బావని చేసుకోడం లేదా పొగరుబోతుని గ్రాడ్యుయేట్ చేసుకోలేదా— సినిమాల్లో!!

బి వి విజయవాడ.

ఒక స్త్రీ పెళ్లి అయాక ఆమె ఇంటి పేరుపోయి భర్త యింటిపేరు వస్తోంది కదా. అంతర్జాతీయ మహిళాసంవత్సరం గడిచి పోయింది. దీన్నిగురించి స్త్రీ ఆలోచించి ఉద్యమం లేపలేదేం?

ఈ దేశంలో ఆడవాళ్ల కోరికలు హేళనకే గురి అవుతాయని తెలిసిపోయింది. పాశ్చాత్య దేశాల లోనే— ఈ విషయంలో కొత్తరకం ఉద్యమం బయలుదేరిందని టైమ్ పత్రిక రాసింది. అసలు పిల్లల పేర్లకి చివర తండ్రి పేరే ఎందుకుండాలి? తల్లి పేరు ఎందుకుండకూడదని. 'మేరీ డాటర్ ఆవ్ గ్రేస్' అనో 'టామ్ సన్ ఆఫ్ గ్రేస్' అనో ఎందుకుండకూడదని వారి వాదన. అక్కడ ధైర్యంగా ఆచరణలోకి దింపకల స్త్రీలూ వున్నారు. ఈ దేశంలో ఆడవాళ్లే— ముందు ఆలోచించరే!

సి. హెచ్. ఎల్ ఆర్. గుడుగుంట్ల పాలెం.

హక్కుల సంగతి అలా వుంచి-ఆ వంట సంగతేమిటో చూడు. . . అంటే?

నా చేతివంట రుచి చూసిన ఎవరూ ధైర్యంగా ఆ మాట అనడం వినలేదే!!

ఆర్. ఎల్ కె పామ రు.

స్నేహం అంటే తెలియని ఒంటరికి మీరిచ్చే సలహా ఏమిటి?

స్నేహితులు లేక పోవడమే— ఘోరం. అటువంటి ఏకాకి బ్రతుకకి స్వస్తి చెప్పడానికి ప్రయత్నం చెయ్యాలి. స్నేహం ప్రదర్శిస్తేగద—స్నేహం ఎదురయ్యేది?

**కొండబాబు టి కొత్తపల్లి.**

నేటి చలన చిత్రాలపై మీ అభిప్రాయం?

— ఏదీ? అభిప్రాయ ప్రకటన చేసేలోగా తిరిగొచ్చేస్తున్నాయంటున్నారు. అనుభవజ్ఞులు! అందుకే— నేడే చూడండి అంటున్నారట— అంటే— రేపు వుండదు కనుకనా?! అని అడగాలికదా వారి?

**జా ఆర్. తుని.**

తెలివితేటలు ప్రదర్శించవద్దు. సూటిగా జవాబు ఇవ్వండి.

ఎలా? తెలివి లేకుండా సూటిగా జవాబివ్వమనడం 'నోరు మూసుకుని బదులు చెప్పు' అన్నట్టు వుంది!

**బి జి. సౌత్ మోపూరు**

మగవాడితో సమానంగా పోట్లాడే ఆడదానికే— మగవానిపై ప్రేమ వుంటుందని నా నమ్మకం.

నిజమే— పోట్లాడే ఆడదానికి మనస్సులో చీకటి కోణం వుండదు. ఎలా పోట్లాడగలదో అలాగే— ప్రేమించగలదు. ●

# నిప్పూ-నీరూ!

వి.వి.ఎస్.బి.కుటుంబరావు



ఈరమ్మంటే ఈసురోమంటూ ఉండదు!

"ఎందుకొచ్చిన బతుకు దేవుడో?" అంటూ ఉండదు!

"ఈ వయసంతా నాది!" అన్నట్లు పెటపెటలాడి పోతుంది

"ఈ సొగసంతా నాది!' అన్నట్లు తళతళలాడి పోతుంది.

ఈరమ్మకు సరిగ్గా పద్దెనిమిదేళ్ళు. ఖర్మగాలి పని మనిషిగా ఉంది గానీ-

కాలం కలిసొస్తే హీరోయిను కావాల్సిన లక్షణాలన్నీ ఉన్నాయి ఇళ్ళల్లో పని చేసి ఈరమ్మ పొద్దుటి పూట ఇంటికి తిరిగొస్తుంటే-

కాళ్ళకు పెట్టుకున్న కడియాలు లయబద్ధంగా చప్పుడు చేస్తుంటే... ఆ చప్పుడు దానొంక తినేసేట్లు చూసే కుర్రకారు గుండెల్లో వినపడుతుంది!

దాని ఒంపులు కళ్ళకు విందు చేస్తుంటె. ఆ ఒంపుల సొంపులు మనసు మత్తెక్కిస్తాయి!

కుర్రకారే కాదు – నడికారు – కూడా... ఆఖరుకు మూలనున్న ముసలయ్య గూడా...! ఈరమ్మ అందం చూసి... లొట్టలెయ్యాల్సిందే!

అయితే ఈరమ్మంటే నిప్పు! దాన్ని ముట్టుకోవాలంటే... అది పెద్ద తప్పు!

మండుకొస్తుంది ముప్పు!!

వీధివాకిలి ఊడుస్తుంటే...

వంగున్న దాని అందం చూసి పిచ్చెక్కిన ఓ పోకిరి కుర్రాడు...

ఏదో ఓ కొంటె మాటంటే...!

చీపురు పెట్టి వాడి వళ్ళు మాలీసుచేసింది ఈరమ్మ!

కళ్ళాపు జల్లుతుంటే..

కళ్ళింతజేసుకుని దానిముందు అందాలు చూస్తూ...ఎదురింటి నడివయసు రసికుడు.. పళ్ళికిలిస్తూ...!

"ఈరమ్మా! ఏడెక్కిపోతోందే నిన్ను జూత్తుంటె..!" అన్నాడు.

"సచ్చినోడా! సల్లబరుత్తానుండరా!" అంటూ...కడివెడు కళ్ళాపు నీళ్ళు వాడి నెత్తినపోసింది! తెల్లవారు ఝామున.....

తనే అంట్లు వెయ్యటం అలవాటున్న భార్యా విధేయుడొకడు...! గిన్నెలేస్తూ... నున్నగా ఉన్నదాని బుగ్గలు నిమరాడు.చెయ్యట్టుకుని.. "నూతి వక్కకెడదాం పద..! మా నిద్రపోతోంది... అంతాచీకటి.!...అదగో అయిదురూపాయలు!" అన్నాడు.

అంతే..! ఈరమ్మా "నాసెయ్యి బలేగా అట్టుకున్నావు బాబు! ఏదీ నాసెయ్యొదిలి.. నీసెయ్యి సూపు!" అంది.

అయిసయిపోయి అలాగే చేశాడా మహానుభావుడు.!

"కాదు! ఎనక్కి తిప్పు! నీఏల్ల అందం సూడాలి!" అంది కరగి పోయాడు పరమ పురుషుడు.!

చిప్ప గరిటె పెట్టి బలంగా ఒక్కటిచ్చుకుంది. అంతే యింట్లోకి పరిగెట్టాడు.

వాచి పోయిన చెయ్యిచూపి. తెల్లవారు ఝామున ఊర్మిళలా నిదపోయే భార్య అడిగితే. వాలీబాల్లో బెణికిందని చెప్పుకున్నా నమ్మలేదామె!

# తలకు రంగు వేసుకోవటాన్ని గురించి మీరు తెలుసుకో దలుచుకున్న అన్ని విషయాలకు జవాబుల నివ్వటానికి గోద్రెజ్ చాలా సంతోషిస్తున్నారు!

తల నెరవటం అగస్మాత్తుగా, అకాలంగా జరగవచ్చు. అది సంభవించినప్పుడు అనేక మంది అనేక విధాల దాన్ని గురించి భావిస్తారు. కొంత మంది చాలా తేలిగ్గా తీసుకొంటారు. కొంత మంది దాన్ని గురించి చాలా తీవ్రంగా ఆలోచిస్తారు. కాని చాలా మంది దాన్ని అలావది లేస్తారు. నిజంగా ఇది శోచనీయమైన విషయం. ఎందుచేతనంటే తెల్ల జుట్టు నల్లబడే అవకాశముంది. చాలా సులభంగా.

**ప్ర: తలకు డై చేసుకోవటం ఎప్పుడు ప్రారంభించాలి!**

స: మొదటిసారి నెరసిన వెంట్రుకలు కనిపించగానే ప్రారంభించటం మంచిది.

**ప్ర: చాలా కాలం హెయిర్ డై వాడినందువల్ల జుట్టు దెబ్బ తింటుందంటారు నిజమేనా?**

స: కాదు. అయితే మీరు సరియైన హెయిర్ డై ఎన్నుకోవాలి. గోద్రెజ్ హెయిర్ డైలో ప్రత్యేకమైన పదార్థాలు వాడబడటం చేత అది జుట్టుకు ఒక విధమైన శరీర సౌష్ఠవాన్ని కల్పిస్తుంది. అంతేకాదు, దానిలో అంతర్‌నిర్మితమైన కండిషనర్లుండటం చేత మీ జుట్టును మీరు కావలసిన విధంగా ఉంచుకోవటానికి దానికి కాంతి నివ్వటానికి తోడ్పడుతుంది.

**ప్ర: దానివల్ల చర్మం మీద ఎటువంటి దుష్ప్రభావమూ ఉండదా?**

స: సామాన్యంగా అలాంటి దేదీ ఉండదు. కాని, మొదట్లో ఒక చిన్న పరీక్ష జరుపుకోవటం ఎప్పుడూ మంచిది. ప్రతి మంచి హెయిర్ డైతోను ఇది ఎలా జరపాలో తెలుపుతూ సూచనలు లభిస్తాయి.

**ప్ర: శాశ్వతమైన హెయిర్ డై ఎంత శాశ్వతమైంది?**

స: డై వేసుకున్న జుట్టు రంగు అనేక వారాల వరకు అలానే ఉంటుంది. కాని, క్రొత్త జుట్టు పెరుగుదల కనిపించగానే, మూడు లేక నాలుగు వారాల తరువాత నెరసిన జుట్టును తిరిగి దిద్దటం అవసరం.

**ప్ర: డై యొక్క రంగు బట్టలు మరియు తల గడాలకు పట్టుకుంటుందా?**

స: ఏమాత్రం పట్టుకోదు. అనేక యితర హెయిర్ డైల మాదిరి గోద్రెజ్ హెయిర్ డై జుట్టుకు పూత పూయదు, అది జుట్టు ఫలకంలోకి చొచ్చుకుపోయి అక్కడే ఉండిపోతుంది.

**ప్ర: జుట్టుకు డై వేసుకొన్న తరువాత నా జుట్టును మామూలు పద్ధతిలో దిద్దుకోవచ్చునా?**

స: తప్పకుండా: జుట్టును షాంపూతో రుద్దుకోవచ్చును, తల నూనెలు లేక క్రీములు కూడ వాడవచ్చును.

**ప్ర: జుట్టును ఇంటి వద్దనే డై చేసుకోవటానికి వీలుగా ఉంటుందా?**

స: నిశ్చయంగా. గోద్రెజ్ హెయిర్ డై వేసుకోవటాని చాలా సులభం. మీరు డైని జుట్టులోకి స్పాంజి చేయండి. అది సునాయాసంగా సరిసమానంగా జుట్టు వ్రేళ్ళ వరకు వ్యాపిస్తుంది.

**ప్ర: అన్ని హెయిర్ డైలూ వాడకానికి కొంత బాధగా ఉంటాయా?**

స: నిజానికి కాదు. గోద్రెజ్ హెయిర్ డై వాడటానికి చాలా వీలైంది. అది సౌమ్యంగా, చక్కని సువాసన కలిగి ఉంటుంది.

**ప్ర: అది చాలా ఖర్చుతో కూడిన విషయమా?**

స: మీ జుట్టు భుజాల వరకు ఉంటే, ఒక్క సీసా హెయిర్ డై మరియు డెవలపర్ మీకు దాదాపు మూడు నెలపాటు వస్తుంది. మీరు ఇంటి వద్దనే జుట్టును డై చేసుకునే పక్షంలో, అందుకు షుమారు నెలకు రూ 3/- వరకు ఖర్చవుతుంది.

**ప్ర: నేను రంగు వేసుకున్న తరువాత నా జుట్టు సహజంగా నల్లగా కనిపిస్తుందా?**

స: నిశ్చయంగా. అయితే మీ జుట్టు సహజంగా ఉండే రంగును బట్టి అనుకూలమైన ఛాయను (షేడ్) మీరు ఎన్నుకోవాలి. మీ జుట్టు రంగు లేతగా ఉండే పక్షంలో, గోద్రెజ్ బ్రౌన్ హెయిర్ డై వాడండి.




**గోద్రెజ్**
పర్మనెంట్ హెయిర్ డై
ముందు ఇతర డైలన్నీ పాతకాలపు డైలుగా ఉంటాయి.

అతనికి మరియు ఆమెకు
2 ఛాయలు: (షేడ్స్) నాచురల్ బ్లాక్, డార్క్ బ్రౌన్.

CMGS-81-234 TL

నమ్మినట్లు నటించి సంతోషించిందామె..
అంతే...

దాని క్కారణం... !ఈరమ్మ...తనపని కార్యం... ఎదురింటావిడకు చెప్పటం...ఆమె ఈమెకు మాటలు మొయ్యటం గూడా

## నిప్పూ -నీరూ !

అయిపోయింది అప్పటికి.!!

మరో యింట్లో ...!

మసక చీకట్లు విడిపోయే సమయంలో సమయంలో నూతిలో నుంచి బొక్కెనతో నీళ్లు తోడుతోంది ఈరమ్మ. పెళ్లాన్ని పుట్టింటికి పంపిన గృహస్థుకు బోలెడంత జాలి పుట్టుకొచ్చింది ఈరమ్మ మీద! “చేతులు నొప్పెట్టవూ ఈరీ” అంటూ

---

వచ్చి ఈరమ్మ వెనుకగా నిల్చుని తన శరీర మంతా సానుభూతిగా ఈరమ్మ వెనక భాగాని కాన్చి బొక్కెన లాగేందుకు తనూ సాయం చెయ్యబోయాడు.

బొక్కెన బయటికి లాగింతర్వాత ఆ చొంతాడు నాలుగు మడతలేసి యీరమ్మ అతని వళ్ళంతా ఉతికేసి "వళ్ళు నెప్పెట్టదూ పాపం ?" అంది.

ఆయన అరుపులకి ఇరుగు పొరుగు వాళ్ళంతా ఇన్విటేషన్ లేకుండా వచ్చిన ప్రేక్షకులలా వచ్చిచూసి "ఈయనకిదేం రోగం ?" అనుకుని ఈరమ్మను "శభాష్ !" అనుకుని మెచ్చుకున్నారు.

ఎవరు ? మగవాళ్ళు కాదు !

ఆడవాళ్ళు ! ఎందుకో తెలుసా ?

అందమైన పని మనిషిని పెట్టుకుంటే? తమ భర్తలను తాము పట్టుకోలేమని నాలోజుల్లోనే దాన్ని తమ సవతిగా చేసేస్తారని గొరాయిళని ధృడనమ్మకమున్న ఇల్లాళ్లంతా! అంతేగాదు ఏకగ్రీవంగా ఓ నిర్ణయాని కొచ్చారు.

ఈరమ్మను పని మనిషిగా పెట్టుకున్నా తమకేం చీకూ చింతా లేదనీ తమ మొగుళ్ళ నిప్పు తాషామర్పా మోగించగలదనీ అందుకె వాళ్లకంత సంతోషం.

ఇంకేం ఇల్లాళ్ళంతా తమ మొగుళ్ళను ఈరమ్మ కొదిలేశారు! నిశ్చింతగా తెల్లారు మూమున హాయిగా నిద్రపోసాగారు ! యధేచ్ఛగా పుట్టింటికి పోసాగారు...!

ఈరమ్మ గదులూడుస్తున్నపుడు.. తమ మొగుళ్ళు ఆ గదిలో ఉన్నా..! సి.ఐ.డీ పని చెయ్యటం మానేసారు.!

దానిక్కారణముల్లా ఒక్కటే!

ఈరమ్మ నిప్పు !

ఈరమ్మ అగ్ని !

ఈరమ్మ సీతామ్మవారులాంటిది.!

ఈరమ్మ కనక దుర్గమ్మలాంటిది.!

రసికుల పాలిటి రాక్షసి.!!

అయితే.. ఈరమ్మవిషయంలో కొద్దాం!

ఆమె మనసు పరిశీలిద్దాం.

ఎందుకంటే.. ఎంతనిప్పయినా..

ఈరమ్మా మనిషేగా..? !

"నిప్పు! నిప్పు! అని మహిళా మణులు ప్రశంసలు చేసేసరికి... ఈరమ్మలో ఏదో "యిది" పుట్టుకొచ్చింది...!

ఆ "యిది" ఇంతై..!అంతై..!అంతంతై కూర్చుంది !

దాన్ని అందంగా "అహం !" అంటారు. విజ్ఞులు. మామూలుగా "గర్వం" అంటారు అజ్ఞులు.

"నామీద సెయ్యివెయ్యమను దమ్ము! యింటే.."

ఏమగ సచ్చినోడి కుంది– ? అనుకుంది ఈరమ్మ . గర్వంగా...!సగర్వంగా..! కాని ఒకందుకు ఈరమ్మకు బాధగా ఉంది

"నిప్పుముద్ద !" అని తెలిసిన తర్వాత. ఏమగాడు ఈరమ్మతో కొంటె మాటలు మాట్లాట్టానికి, చిలిపి చేష్టలు చెయ్యటానికి...ముందుకు రావటంలేదు...మగవాణ్ణి ఏడిపించే ప్రవృత్తి అనాదిగా ఆడదానికున్న దేమో...? ఈరమ్మా ఆ అంశేగా?!

ఈరమ్మకు జీవితాశయాంతికంగా... మన భాషలో 'థ్రిల్' లేకుండా నడవటం ఏం బాగాలేదు కనీసం ఒక్క మగవాడినన్నా ఏడిపించాలి! కవ్వించి... రెచ్చగొట్టి.. బుద్ధి చెప్పాలి! తను పకా పకా నవ్వాలి! అప్పుడు తనకు సంతోషం. ఇదీ ఇప్పటి ఈరమ్మ మనస్తత్వం.

అందుకని...

ఓ బుద్ధావతారం లాంటి శాల్తీని ఎప్పు కుంది! అతని పేరు కామేశం. అతనెప్పుడూ కామ్‌గా ఉంటాడు. అందుకనేనేమో? అతని పేరు కామ్ ఈశం! కామేశం! పర స్త్రీల యెడల ప్రవరాఖ్యుడి లాంటి కామేశం అంటే... అతన భార్యకి అమితగౌరవం.

ఆమె హఠాత్తుగా పుట్టింటికెళ్లాల్సొచ్చినా... ఏమీ విచారపడలేదు.

పైగా

ఈరమ్మతో మరీమరీ చెప్పి వెళ్ళింది. మీ అయ్యగారికి నోట్లో నాలుకలేదు .! స్నానముకు కావలసిన వేడినీళ్ళు అవి చూడు...! గదులన్నీ చిందరవందర చేస్తారు. ఊడ్చి అద్దంలా ఉంచు! నేనులేని లోటు కనిపించరాదు' అని

ఈరమ్మకేమో చిలిపి మనస్సు ఏమో బోధించింది.

ఇల్లాలు వెళ్ళిపోయింది ఊంపరిగా.

"బాబుగారూ..."

"ఊఁ!"

"నన్నందరూ నిప్పంటరు గండా. ఎందుకని?"

"ఏమో ఈరమ్మా?"

"అత్తంతే నామారుకోను! నాసెయ్యట్టుకుని సూసి సెప్పండి!" అంది ఈరమ్మ గది ఊడ్చే చీపురవతల పారేసి

"అమ్మబాబోయ్ ! నిప్పుకాలతుంది!"

ఎగిరి గంతేశాడు కామేశం

ఎంత బతిమాలినా ఈరమ్మ చెయ్యిపట్టుకోలేదు సర్లెమ్మని అప్పటికి ఊరుకుంది ఈరమ్మ.

గది ఊడిచి వెళ్ళిపోయింది.

కాని పట్టుదల పెరిగింది.

"ఏటి ? పెద్ద శానతనం పోతండు!

కాతంత సెయ్యట్టుకుంటే కరిగిపోతదా!"

అనుకుంది - అహం దెబ్బతింది.

ఆలోచించది . ఆలోచించింది.!

ఆమె బుర్రలో ఏవో తళుక్కుమంది.

మరునటిరోజు వచ్చింది కామేశం ఇంటికి తెల్లవారఝాము నాల్గుగంటలు! చిక్కని చీకట్లు.!!

దానికి తోడు ఈరమ్మ వచ్చిన అయిదు నిముషాలకు జోరున వాన పట్టుకుంది.

స్వంతంగా వంట వండుకునే కామేశం– గిన్నెలెయ్యబోతున్నాడు

"వానలో ఎలా తోమమంతారు?" అంది.

"మరేం చేస్తావు?' కామేశం అమాయకంగా అడిగాడు.



చిలిపితనం రెచ్చగొట్టింది ఈరమ్మను. అవకాశం పంతం నెరవేర్చుకోమంది.

"ఏం ఫరవాలేదు నిప్పు! తను నిప్పు!" మనసు భరవసా ఇచ్చింది.

"మీ ఈపు తోముతాను!" అంది ఈరమ్మ కిలకిల నవ్వుతూ.

"బాబోయ్! నువ్వు నిప్పు నా వీపు కాలిపోతుంది" బిక్కమొహం పెట్టాడు కామేశం.

అంతటితో ఊరుకోలేదతను. భయపడ్డ పిల్లవాడిలా ...

"నిజంగా తోముతావా? నాకు భయం!" బెడ్‌రూంలోకి పరుగెట్టాడు.

అంతకంతకూ పెరుగుతున్న పట్టుదల ఈరమ్మలో... నిప్పులాంటి మనిషి

# నిప్పూ - నీరూ!

ఈరమ్మలో ...

"నిన్నియాల వదిలిపెట్టను! ఈపు తోమాల్సిందే!"

"కాలిపోతే ... మా ఆనిడ ఏడవదూ?" భయంగా ప్రశ్నించాడు.

ఈరమ్మకు అతన్ని ఇంకా ఏడిపించాలని పించింది.

మెత్తనమ్మను చూస్తే మత్తు బుద్ధ్యుందట!

"ఈపు తోమితేనే కాలుతుందంటావు .. మరి...! ఇంకా ఏమిటి బాబూ?"

వణికిపోతున్నాడు కామేశం.

"వల్లంతా తోమితే ఏమవుతావూ అంది?" పకపక నవ్వింది.

"అయ్య బాబోయ్! మాడి బొగ్గయి పోతాను!" అమాంతం మంచం మీద ముడుచుకుపోయాడు.

"అదీ చూతాను!" అంది ఈరమ్మ— పట్టుదల ఆమెలో పిచ్చి ఆవేశం రెచ్చగొట్టింది.

అమాంతం కామేశం మంచంమీద కురికింది పులిలా ఆడ పులిలా...!

ముడుచుకుపోయున్న అతన్ని ఇటు దొర్లించింది బలంగా ..

"ఏదీ కాలిపోతానన్నావే! ఇప్పుడు సెప్పు!" అంది అతనమాయకుడనే ఇంకా ఈరమ్మ విశ్వాసం!

కాని అది క్షణాలలో మాయమయింది.

తారుమారయింది.

"ఈరమ్మా!" అన్నాడు కామేశం.

విషపునవ్వు నవ్వాడు కామేశం.

"ఇప్పటికి నా పంజాలో చిక్కావు!" బలంగా కౌగిలి బిగించాడు.

"నీ గర్వం నేనణుస్తాను చూడు!"

ముఖంమీదపడి ఉక్కిరి బిక్కిరి చేశాడు. నిర్ఘాంతపోయింది. ఈరమ్మకు ఊపిరి సలపటంలేదు.

గొంతు పెగల్చుకుని "బాబుగోరూ! నన్ను పాడుసెయ్యకు... ఏదో సెతురాడాను!" అంది.

అయినా ఏం లాభంలేకపోయింది.

కామేశం తన పేరును సార్థక పరుచుకున్నాడు అయిదు నిముషాల్లో... నిప్పు నీరై పోయింది.

నిప్పులాంటి మనిషి ఈరమ్మ శీలం ... కాలి బూడిద అయిపోయింది.

"కణకణలాడే నిప్పుగూడా నీటికిలోకువే!" అన్న సత్యం తెలుసుకున్న ఈరమ్మ భోరుమంది. కాని అప్పటికి ఆమె జీవితం ముక్కలయింది.

ఒక్కసారిగా ఈరమ్మలో మాయమయిన ఉత్సాహానిక్కారణం... ఏమిటో? ఆ పేట ఇల్లాళ్ల కర్థంకా లేదు!!

నెల రోజులయింది. ఈరమ్మ పనిలోకి రావటం మానేసింది...వో రోజు తెల్లారేసరికి ఈరమ్మ యింటలేదన్నవార్త గుప్పుమంది. అంతా వెతికారు — పూరవతల చెరువులో ఈరమ్మ భౌతికకాయం దొరికింది.

# ౩ నెలలప్పుడు పాపకు యిచ్చే ఘన ఆహారం మిగతా జీవితపు స్వరూపాన్ని నిర్ణయిస్తుంది:

## కేవలం పాలుయిస్తే చాలదని డాక్టర్ల అభిప్రాయం



**డాక్టర్లు సిఫార్సు చేస్తారు**

# ఫారెక్స్®

**సంతులిత ఘన ఆహారం**
**త్వరగా సంపూర్ణమైన పెరుగుదలకోసం**



పాపకు 3 నెలలు వచ్చాయంటే, పెరిగే సమయం మొదలైందన్న మాట.

పాప శరీరమూ దానితో బాటే మెదడూ పెరగటం ప్రారంభిస్తాయి. అప్పుడు పాలు మాత్రమే యిస్తే చాలదు. అసలు తల్లి పాల నుంచి మార్చే యీ సమయమే ఎదుగుదల సమయం. సున్నితమైన పాప జీర్ణకోశానికి యింట్లో అందరూ తినే ఆహారాన్ని తిని అరిగించుకునేలాగ చెయ్యాలి. దానికి ఫారెక్స్ యివ్వడం కన్న మించినదిలేదు.

**డాక్టర్లు ఫారెక్స్ యివ్వమని సిఫార్సుచేసే కారణం—**

పెరిగే పాప అవసరాలకు కావలసినది దీనిలో ప్రత్యేకంగా సంతులితం చేయబడటం. ఫారెక్స్‌లో, ఆరోగ్యమైన రక్తమూ, శక్తినీ యిచ్చే యినుము సరియైన ప్రమాణంలో ఉంది— తల్లి పాల నుంచి మార్చేటప్పుడు యిచ్చే ఏ యితర ఆహారంలోనూ యిది యింత సరియైన పద్ధతిలో సంతులితం చేయబడలేదు. ఫారెక్స్‌లో గల కాల్షియం, విటమిన్ డి2 పాపకు పటిష్ఠమైన ఎముకలూ, గట్టిపళ్ళూ సమకూరుస్తాయి. సరియైన ప్రమాణంలో గల ప్రోటీన్లు, మెదడునూ, శరీరాన్నీ త్వరిత గతిలో పెరిగేలా చేస్తాయి. పాప అవసరాలకు కావలసిన శక్తి యిస్తుంది. అందుకే తల్లులు మిగతా వాటికన్న ఫారెక్స్‌నే ఎంచుకుని యిస్తున్నారంటే ఆశ్చర్యం ఏమీ లేదు.

**ఫారెక్స్, తల్లి పాలనుంచి మార్చే సమయంలోని ఆదర్శ ఆహారం**

వివిధ రకాల ఆహారాలతో కలిపినప్పుడు రుచిగా ఉండేది ఒక్క ఫారెక్స్ మాత్రమే. పళ్ళు, కూరగాయలు, పప్పు, మాంసం, గుడ్లు లాంటి అవసరమైన ఆహార పదార్థాలను ఫారెక్స్‌తో కలిపి పాపకు అలవాటు చేయవచ్చును. మీ పాప వీటిని రుచిగా, యింట్లో అందరితో బాటు యిష్టంగా తింటుంది.

**ఫారెక్స్ పుస్తకం కోసం, రూ. 2 తగ్గింపు పథకం కోసం రాయండి...**

మీ పేరు, విలాసం (ఏ భాషలో పుస్తకం కావాలో రాయండి), దానితో బాటు 25 పై. స్టాంపులు, పోస్ట్ బ్యాగ్ 19119, బొంబాయి 400 025కి రాయండి.




LIL.GF.53-934 TL /

### కథల్పోటీ - కవితల పోటీ

యువరచయిత(త్రు)లను ప్రోత్సాహించే నిమిత్తం శ్రీ రాజావాణీ సాహితీ నిలయం 'మాణిక్య దీపిక' [100] మినీపథం సంకలనంతోపాటు, పెద్ద కథలపోటీ- కార్డు కవితల పోటీ నిర్వహిస్తోంది. కథలకు ప్రథమ, ద్వితీయ, తృతీయ బహుమతులుగా రు. 116–75 ... ఇవిగాక మరో 5 కథలకు ప్రశం... బహుమతులుంటాయి. కార్డు కవితలపోటీ—ప్ర... ..., తృతీయ కథలకు రు. 50—25—15 ల బహుమతులే గాక మరో మూడిటికి ప్రత్యేక బహుమతులుంటాయి. పూర్తి వివరాలకు సొంత చిరునామాల కవరులో ఈ క్రింది చిరునామాకి రాయండి.

డైరెక్టర్ : శ్రీ రాజావాణీ సాహితీ నిలయం,
మహానంది, P O — 518502,
నంద్యాల, కర్నూలు జిల్లా.

## హైదరాబాద్ నోట్ బుక్

(36వ పేజీ తరువాయి)

19 నెలలపాటు జయిల్లో వుంచింది. జనతా పార్టీ ఎన్నికల ప్రణాళికలో అంశాలు 19.ఆలోచించి పెట్టారనుకోవద్దు ఇది కేవలం యాదృచ్ఛికం అన్నారు ఆయన. ఏమయినా, ఈ రెండు పందొమ్మిదులుకలవడం బాగుంది. ఇవి రెండూ కలిసి 38 అయి మరొక దానికి సూచన కావచ్చు.

**బాల పునః ప్రచురణ**

శ్రీ న్యాయపతి రాఘవరావు 1947 లో ప్రారంభించి, చాలకాలం నడిపి, ఆరేళ్ళగా ఆపిన బాల పిల్లల పత్రికను ఆంధ్రప్రదేశ్ బాలలఅకాడెమీ పక్షాన ఉగాదినుండి మరల ప్రచురిస్తారు. దీనికి శ్రీ న్యాయపతి రాఘవరావు, శ్రీమతి న్యా... పతికామేశ్వరమ్మ సంపాదకులుగా వుంటారు.రాష్ట్రంలోని బాల వాఙ్మయ రచయితలు, బాలకళాకారులు ఈ పత్రికకు తమ రచనలను పంపి ప్రోత్సహించవలసినదిగా ఆయన కోరుతూ వివరాలను బాలల అకాడెమీ, పత్రికా విభాగం, బర్కత్‌పురా, హైదరాబాద్ 500 027 అనే చిరునామాకు వ్రాయాలని కోరారు.

**వయః పరిమితి హెచ్చింపు**

రాష్ట్ర ప్రభుత్వోద్యోగాలలో హరిజన గిరిజనఅభ్యర్థులకు కేటాయించిన స్థానాలకు, ఆ అభ్యర్థులను ఎంపిక చేయడానికి నిర్ణయించిన పరిమితిని ప్రభుత్వం మరి ఐదుసంవత్సరాలు పెంచింది అంటే, హరిజన గిరిజనులు 45 సంవత్సరాలవరకు ప్రభుత్వోద్యోగాలకు అర్హులన్నమాట.

**అక్కిరాజు రాజీనామా**

రాష్ట్ర మాజీ మంత్రి శ్రీ అక్కిరాజు వాసుదేవరావు ఫిబ్రవరి 27న కాంగ్రెస్ పార్టీకి రాజీనామాయిచ్చారు. శ్రీమతి గాంధీ అనుసరించేవిధానాలవల్ల ఎందరో, ఎన్నో త్యాగాలు ఏ లక్ష్యంకోసం చేశామో అవి క్రమేణ హరించుకుపోతున్నాయని అందువల్ల అత్యవసర పరిస్థితిలో కలిగిన ఫలితాలు గూడ తుడిచి పెట్టుకుపోయాయని శ్రీ వాసుదేవరావు ప్రకటన చేశారు. మహబూబ్‌నగర్ జిల్లాలోను మరికొన్ని జిల్లాల్లోను కాంగ్రెస్‌నుండి రాజీనామాల వార్త విశేషంగా విన బడుతున్నాయి.

**అమెరికాకు మరి కొందరు శిల్పులు**

అమెరికాలోని న్యూయార్క్, పిట్స్‌బర్గ్ నగరాలలోజరుగుతున్న భారతీయ దేవాలయాల నిర్మాణం త్వరలో పూర్తి చేయడానికి మరి34 మంది తీయు శిల్పులు, తాపీమేస్త్రీలు, స్థపతులు మార్చి మొదటివారంలో అమెరికాకు బయలుదేరారు.పిట్స్‌బర్గ్ నిర్మాణం పూర్తయిందని, వేంకటేశ్వర విగ్రహ ప్రతిష్ఠ జరిగిందని ఇక్కడినుండి వెళ్లిన అర్చకులు అక్కడ అర్చనలు కూడ జరుపుతున్నారని రాష్ట్ర ధర్మ దేవాదాయ కమీషనర్ శ్రీ కె. పురుషోత్తమ నాయుడు అన్నారు. ఈ దేవాలయం గోపురం మాత్రం పూర్తి కావలసివుంది. మరొక అర్చకుడు పురోహితుడూ వెళ్ళుతున్నారు.

**ఉపశ్రుతి :—**

ఇటీవలే మరణించిన ఒక మహా నాయకుని శవయాత్రలో నడుస్తున్నాను. ఆయన ప్రత్యర్థి కూడ నడుస్తుండడం చూసాను "ఏమిసార్, మీరూ వచ్చారు" అన్నాను. "ఏమీలేదు ఈయనవెళ్ళ కెరియరిస్తు మరచాప్పెకివచ్చాడు. ఇప్పుడు ... పట్టుకుని వెళ్ళుతున్నారో చూద్దామని" ...న్నాను అన్నాడు ఆయన.

— తిరుమల రామచంద్ర





**Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna**


CINTHOL
Godrej
CINTHOL
DEODORANT AND COMPLEXION SOAP
CINTHOL